ద్వితీయ కుసుమము

# జీమూత వాహనుడు

## (పద్యాకృతి)

గ్రంథకర్త
'నీతివచోభిజ్ఞ'
**దూడం నాంపల్లి**
తెలుగు యూనివర్శిటీ అవార్డు గ్రహీత
'స్వర్ణసాహితీ' పురస్కార గ్రహీత

ప్రచురణ
**శ్రీవాణీ గ్రంథమాల**
సిరిసిల్ల - 505 301.

తిరుమల తిరుపతి దేవస్థానమువారి
ఆర్థిక సహాయముతో ముద్రితము

ప్రచురణ సంఖ్య : 2

ముద్రణ : జనవరి 1995
భవ, మకరసంక్రాంతి 1916 శా.శ.

ప్రతులు : వేయి

ముఖపత్ర రచన : శ్రీ ఆగాచార్య, కరీంనగర్.

ముఖపత్ర ముద్రణ : శ్రీబాలాజీ ఆర్ట్స్ ప్రింటర్స్
చిక్కడపల్లి, హైదరాబాదు.

**వెల రూ. 10/-**

ప్రతులకు :

దూడం నాంపల్లి,
8-5-33/4/1, ప్రగతినగర్,
సిరిసిల్ల-505 301,
కరీంనగర్ జిల్లా (ఆం.ప్ర.)

ముద్రణ :
శివాజీ ప్రెస్,
4-4-53, గంజ్
సికింద్రాబాద్ 500 003



# ఉన్మీలనము

**Keshava pantula Narasimha Sastry**

(K.V.N. Sastry)Vidwan, Siromani
Rtd. Programme Executive,
All India Radio
Ex-Member A.P. Sahitya Akademi
HYDERABAD-500027.

శ్రీహర్ష విరచితములైన రత్నావళి, ప్రియదర్శిక, నాగానందం - అను మూడు రూపకములలో నాగానందం అను సంస్కృత నాటకమునకు అనువాద రూపమైనదే ఈ "జీమూతవాహనుడు" అను కావ్యము. సంస్కృత కవులలో శ్రీహర్ష నామధేయులు అయిదుగురున్నారు. వారు (1) నైషధ కావ్యరచయిత శ్రీహర్షుడు, (2) కావ్యప్రదీపకారుడైన గోవిందఠక్కురుని తమ్ముడు, (3) ధారా నాథుడైన భోజరాజు పౌత్రుడు, (4) కాశ్మీరరాజు, (5) కాన్యకుబ్జస్థానేశ్వరముల ప్రభువు హర్షవర్ధన చక్రవర్తి అనువారు. ప్రాచ్యపాశ్చాత్య విమర్శకుల విమర్శనా ఫలితముగా కాన్యకుబ్జ స్థానేశ్వర ప్రభువైన శ్రీహర్షుడే పై రూపకత్రయ నిర్మాత యని నిర్ణయింపబడినది ఇతడు క్రీ.శ. 620 నుండి రాజ్యపాలనము చేసెను. ఈయన తండ్రి పేరు ప్రభాకరవర్ధనుడు. అతడు 'పరమభట్టారక' 'మహారాజాధి రాజ' బిరుద భూషితుడు. శ్రీహర్షుడు వివిధ శత్రువిజేతయే కాక వాఙ్మయైకాంతిక భక్తుడునై యుండెను. అతని సభ పండిత మండలీ మండితమై యుండెను. గద్య కావ్య మకుటాలంకార ప్రాయమైన కాదంబరిని రచించిన బాణమహాకవి ఈ మహా రాజుచేత అసాధారణ సత్కారము లందియుండెను. ఇట్లు పండిత పోషకుడును, మహాకవియు నైన ఇతని నాగానంద నాటకమును సూత్రధారుడిట్లు ప్రశంసించి నాడు.

శ్లో॥ శ్రీహర్షో నిపుణః కవిః పరిషద ప్యేషాగుణగ్రాహిణీ
లోకే హారిచ బోధిసత్త్వ చరితం నాట్యేచదక్షావయమ్
వస్త్వైకైక మపీహ వాంఛితఫల ప్రాప్తేః పదం కింపునర్
మద్భాగ్యోపచయాదయం సముదితః సర్వోగుణానాం గణః.

ఈ శ్లోకమందున్న 'బోధిసత్త్వ' పదమువలన ఈతడు బౌద్ధమతస్థుడై యుండెనను వాదము సరికాదు. 'బోధిసత్త్వ'అను దానికి బదులు 'సిద్ధరాజ'అని కొన్ని లిఖిత ప్రతులలో నున్నట్టు విమర్శకులు పేర్కొన్నారు. అంతేకాక ఈ నాగానంద నాటక కథలో గౌరి, గరుడుడు, ఇంద్రుడు మొదలైన వైదికదేవతలు పేర్కొనబడుట చేత గూడా ఆవాదము పరాస్తమగుచున్నది.

నాగానంద నాటకమునందు ఐదు అంకములు గలవు. విద్యాధర చక్రవర్తియైన జీమూతవాహనుడు ధీరోదాత్త నాయకుడు. మలయవతి నాయిక. దయావీరము రసము. ఈ నాయకునిలో పితృసేవా పరాయణత్వము, భూతదయ అను గుణములు పరాకాష్ఠ నొందినవి. దయావీరమునే కొందరు లాక్షణికులు ధర్మవీర మని పేర్కొనిరి. దయ ధర్మాంతర్గతమే గనుక అదియు ఇదియు భిన్నములు కావు. గౌతమ ధర్మసూత్రములలో ఆత్మ గుణములు ఎనిమిది చెప్పుచూ ఇట్లు సూత్రించినాడు. "దయా సర్వభూతేషు, క్షాంతి, రనసూయా, శౌచ, మనాయాసో, మంగల, మకార్పణ్య మస్పృహేతి." 'దయా హితచింతనం'-అని మస్కరీభాష్యం ఈ సందర్భములో పురాణవచనం కూడా ఇట్లున్నది.

శ్లో॥ ఆత్మవత్సర్వ భూతేషు
యశ్శివాయ హితాయ చ
వర్తతే సంతతం హృష్టః
కృత్స్నా హ్యేషా దయాస్మృతా.

తనయందువలెనే సర్వస్థావరజంగమ ప్రాణుల విషయములోను హితచింతనము కలిగియుండుటయే దయ అని ఆర్షసిద్ధాంతము. అట్టి దయా వంతుడు కనుకనే జీమూతవాహనుడు శంఖచూడుడను సర్పమునకు బదులుగ తన శరీరమును గరుత్మంతునికి ఆహారముగా సమర్పింపగలిగినాడు. సంతోషముతో అపనికి పూను

కొనుటలోనే యతని ధీరోదాత్తత్వము ప్రస్ఫుటమగుచున్నది. ఇక అతడు తన పితృసేవా పరాయణత్వమును గురించి నర్మసచివుడైన విదూషకునితో.-

శ్లో॥ తిష్ఠన్భాతి పితుః పురోభువి యథా సింహాసనే కింతయా
కిం సంవాహయతః సుఖానిచరణౌ తాతస్య కిం రాజకమ్
కిం భుక్తే భువనత్రయే ధృతిరసౌ భుక్తోజ్ఝితే యా గురో
రాయాసః ఖలు రాజ్యముజ్ఝిత గురో స్తేనాస్తి కశ్చిద్గుణః.

అని యనును. ఆ మాటవిని "అహో ! అస్యగురుజన శుశ్రూషానురాగః"అని విదూషకుడు తనలో తాను ఆశ్చర్యపడును. ఇట్లు భూతదయ, గురుజన శుశ్రూష మొదలగు సద్గుణములచే విరాజమానుడగు జీమూతవాహనుని ధీరోదాత్త నాయకత్వమువలన విరాజిల్లు నాగానంద నాటకేతివృత్తమే ఈ "జీమూతవాహనుడు" అను చిరు కావ్యమునందలి కథావస్తువు.

సంస్కృత నాటకములను ఆంధ్రభాషలోనికి పద్యకావ్యములుగా అనువదించిన వారిలో పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు ప్రథముడు కావచ్చును. ఇతడు మహాకవి కాళిదాసుని అభిజ్ఞాన శాకుంతల నాటకమును 'శృంగారశాకుంతలము' అను కావ్యముగా తెనిగించెను. కృష్ణమిశ్ర యతీంద్రుడు రచించిన ప్రబోధచంద్రోదయమును అదే పేరున 'మలయమారుతకవులు' అని ప్రసిద్ధిని బడసిన నందిమల్లయ్య, ఘంట సింగయ్య అను జంటకవులు ఆంధ్రీకరించిరి. రాజశేఖరుని 'విద్ధసాలభంజిక'ను కేయూరబాహు చరిత్రము అను పేరుతో మంచనకవి తెలుగు పద్యకావ్యముగా రచించెను. జయదేవుని ప్రసన్నరాఘవ నాటకమును బుద్ధుచర్ల చిన తిమ్మయకవి 'ప్రసన్నరాఘవ నాట్యప్రబంధము'అను పేరున తెనిగించెను. కవి మూర్ధన్యుడైన మురారి కవి రచించిన అనర్ఘరాఘవమును (మురారి యని కూడ ఈ నాటకమునకు ప్రసిద్ధి కలదు.) బిజ్జుల తిమ్మభూపాలుడు అలంపూరు పరగణా రాజు అత్యుత్తమమైన ఆంధ్రకావ్యముగా అదే నామధేయమున తెలుగు చేసెను. అట్టి సంస్కృత నాటకములను ఆంధ్ర కావ్యములుగా రచించిన వారి కోవలోనికి వచ్చుచున్నాడు ప్రస్తుత జీమూతవాహన కావ్యరచయిత యగు శ్రీ దూడం నాంపల్లి.

జీమూతవాహనుడు బుదుని యవతారమనియు. అహింసాభిమానియనియు.

జైనమతానుయాయి అనియు ఒక వాదమున్నది. ఆ వాదమునకు నాగానంద నాటకము నందలి ఈ క్రింది నాందీశ్లోకము ఆధారము. జీమూతవాహనుని త్యాగము కూడ దానిని బలపర్చుచున్నది.

శ్లో॥ ధ్యానవ్యాజము పేత్యచింతయసికా మున్మీల్య చక్షుః క్షణం
పశ్యానంగ శరాతురంజన మిమం త్రాతాపి నో రక్షసీ
మిథ్యా కారుణికోఽసి నిర్ఘృణతర స్త్వత్తః కుతోఽన్యఃపుమాన్
సేర్ష్యం మాగవధూభిరత్యభిహితో బౌధౌజినః పాతువః.

ఈ శ్లోకం కేరళ వ్రాతప్రతిలో లేదని ముద్రాపకులు తెలిపినారు. వ్యాఖ్యాత, జిన శబ్దమునకు "జానాతీతి జినః" అనియు, బౌధశబ్దమునకు 'బోధి'గా స్వీకరించి "విశుద్ధబుద్ధి సంతానో బోధిరిత్య భిధీయతే" అను ప్రమాణముచేత అఖండ సచ్చిదానంద స్వరూపుడైన పరమశివుడే యిందలి జినశబ్దమునకు అర్థమైనట్లు తెలిపినారు. కనుక ఇది కేవలము బౌద్ధనాటకమనుటకు తగిన యాధారములు స్పష్టముగా లేవు. ఇంతకు నాగానంద నాటకము కాక తదనువాదము ప్రస్తుతమగుటచేత ఆచర్చ నింతటితో వదలుచున్నాను.

నాగానంద నాటక కథను తెనుగున వ్రాసినవారు కలరు. ఆ కథను ఆధారముగా చేసికొని మూల భావములకు సన్నిహితముగా రసవంతముగా రచించిన ఈ పద్యకావ్యము ఒకనాడు రిజిష్టరు పోస్టుద్వారా నాకు చేరినది. అందులో 26-5-1985 నాడు రచించిన ఒక చిన్నయుత్తరమున్నది. ఆ యుత్తరముద్వారా 'నీతివచోభిజ్ఞ' శ్రీ దూడం నాంపల్లిగారు "జీమూతవాహనుడు అను చిన్న పద్య కృతిని వ్రాశాను. వ్రాతప్రతిని తమకడకు పంపుచున్నాను. దయతో పీఠికను వ్రాయగోరుచున్నాను"-అని వ్రాసినారు. నాకు ఈ కవితో పూర్వపరిచయములేదు. వ్యక్తికి నాంపల్లి అను పేరున్నట్లుకూడ నేనెరుగను. పీఠిక వ్రాయగల ఓపిక గూడా నాకు లేనందున ఏదో అభిప్రాయము వ్రాయుదములెమ్మనుకొని టేబుల్ మీద నుంచినాను. ఒకవారం గడిచింది. ఇంతలో వేములవాడ ప్రాంతపు మిత్రులు రాగా 'నాంపల్లి' ఏమి పేరు అని యడుగగా వారు "యాదగిరి, సింహాచలం, శ్రీశైలం, వేదగిరి" అనియున్న పేర్లవంటిదే-యిది మా ప్రాంతం పుణ్యక్షేత్రమని తెలిపినారు. ఓహో ! అనుకున్నాను. ఈ కాలమున ఛందో వ్యాకరణ బంధములను

త్రెంచిపారవేసి కావ్యములు వ్రాయువారును, అట్లు వ్రాయుడని ప్రోత్సహించు పెద్దలును కోకొల్లలుగా నున్నారు. అట్టి డాక్టర్లు, కళాప్రపూర్ణులను విడిచి నా యభిప్రాయముకోసమై యీ కావ్యమును బంపుటకు బహుశ ఇది పద్యకావ్యమైయుండుటయు, నేనాధునిక రచనాపద్ధతులను అనుసరింపనివాడనై యుండుటయు, కారణమై యుండునని తలచి లాఘవబుద్ధితోనే దీనిని చదువనారంభించితిని. అట్లు నేను భావించుటకు కారణము ఈ కాలమున వెలువడిన పద్యకావ్యముల యందు గూడ పెక్కు వ్యాకరణ చ్ఛందోవాక్య దోషములుండుటయే కారణమని విజ్ఞులకు మనవి చేయుచున్నాను.

కొన్ని పద్యములు చూచిన తరువాత నా యభిప్రాయము తలక్రిందులైనది. లాఘవబుద్ధి తొలగి కావ్యముపై గౌరవభావమేర్పడినది. శ్రీదూడం నాంపల్లిగారు ఛందోవ్యాకరణాది కావ్యసామగ్రి యంతయు కలిగియే ఈ జీమూతవాహన కావ్యమును రచించిరిగాని ఇతరులవలె అఱకొఱ భాషాజ్ఞానము కలవారు కారన్న సదభిప్రాయము గలిగి కావ్యము నంతటిని కుతూహలముతో చదివితిని. వీరి లక్షణజ్ఞానము, భాషాపటిమ, జాతీయసంపద, సంస్కృత లోకోక్తులను పద్యములందిముడ్చు చాతుర్యము, రసభావప్రకటనము మొదలైన సామర్థ్యము నా కానందమును గలిగించినవి. యువరచయితలలో పునః సలక్షణ కవితారచనయం దాదరము చిగుర్చుచున్నదిగదా ! యన్న సంతోషము కలిగినది.

ఇక చదువరులకై నేను కథాసంగ్రహమును వ్రాయనక్కరలేదు. కావ్యమంతయు సులభసుందరమైన సరళ రచనలో సాగియుండుటచేత కావ్య కథ సులభముగానే సామాన్య భాషాజ్ఞానము కలవారికి అవగతము కాగలదు. నాయికానాయక పాత్రపోషణము చక్కగా చేయబడినది. 'ధర్మవీరము' లేదా 'దయావీరము' ముఖ్యరసమై అంగప్రత్యంగములైన విభావాను భావాదులతో బాగుగా వ్యక్తమగుచున్నది. ఆ ధర్మవీరమునకు మలయవతీ ప్రేమరూపమయిన శృంగారమును, చివరి ఘట్టమున జీమూతకేతు కనకవతీ మలయవతులు ఆలంబనముగా వెల్లివిరిసిన కరుణరసమును అంగములుగా నున్నవి. సర్పములపై నమృతవర్షము కురియుట మొదలైన అద్భుతరసాంగ పరిపుష్టమైన ధర్మ వీరరసము విరాజిల్లుచున్నది. 'పితృదేవోభవ' 'మాతృదేవోభవ' 'నావిష్ణు పృథివీపతిః' 'అభ్యాగతః స్వయం విష్ణుః' 'నాతిచరామి' 'క్షుధాతురాణాం నరుచిర్నకాలః' మొదలైన సంస్కృత లోకోక్తులను; వాటితోపాటు కొన్ని తెలుగు లోకోక్తులను పద్యములలో

పొందించిన వీరి రచనా పాటవము మెచ్చదగియున్నది. వీరి భాషాజ్ఞానమున వైనతేయ, వినతేయ శబ్దములు; మాత్రపితలు, గతపదగా, గరుడి, పలాశి- మొ లగునవి మచ్చుతునకలు. 'మిత్రావసు' పదమును 'మిత్రవసు' గాను; 'జీమూ వాహన' శబ్దమునకు 'జీమూతవాహు' గాను కొన్ని శబ్దములకు రూపాంతరము కల్పించుట "అపిమాషం మషం కుర్యాత్ ఛందోభంగం న కారయేత్" అన్న సిద్ధాంతమునకు కట్టుబడుటయే గాని అసామర్థ్యముగాదు. గసడదవాదేశ ద్రు ప్రకృతికాది సంధులమూలమున మారునట్టి అక్షరస్వరూపములను మార్చక పద ములను యథాతథముగా పద్యములందుంచుట సంధి స్వరూపమెరుగని చదువరు సౌలభ్యము కొరకేగాని వ్యాకరణశాస్త్రము నుల్లంఘించు తలంపుకాదు. ఒక్క మాటలో చెప్పవలెనంటే శ్రీనాంపల్లిగారు చక్కని తెలుగుకావ్యము వ్రాసినార వలెను. సంస్కృత వాఙ్మయమున ధర్మవీర రసోదాత్తమైన నాటకమని ప్రసిద్ధి వహించిన 'నాగానందము'నకు ఈ కావ్యము మృదుమధురమైన భావానువాదము. శైలి, జాతీయ పదసంపద, లోకోక్తులు, భావప్రకటన మొదలగు కావ్యగుణము లతో విరాజిల్లుచున్న ఈ కావ్యము లోకమున కందించు సందేశము పరోపకార పరాకాష్ఠ. అది మానవత కెంతయు అమూల్యాభరణము. ఇట్టి కావ్యమును లోక మున కందించిన శ్రీదూడం నాంపల్లిగారు శ్లాఘగుణ సంపన్నులు. దీనిని స్వీక రించిన శ్రీకుంట భాస్కరరెడ్డి బి.ఎ. గారును శ్లాఘ్యతరగుణ సంపన్నులు. ఆధు నిక విద్యావంతులలో పెక్కండ్రు పాశ్చాత్య సంస్కృతి ప్రవాహములో పడి కొట్టుకుపోవువారే గాని శ్రీ భాస్కరరెడ్డి వంటివారు మిక్కిలి యరుదు. దేశీయ భాషాసారస్వతములపై ఆదరమును పెంచుకొనుట ప్రతి భారతీయునికి అవశ్య కర్తవ్యము. ఆ మార్గమున నడచుచున్న ఈ కవియు, స్వీకర్తయు మిక్కిలి ధన్యులు. వీరితోధిక సారస్వతాభిమానులై ఇంకను భారత సంస్కృతి వైభవ మును వెల్లడించు కావ్యామృత కలశములతో వాగ్దేవతను అభిషేకించునట్లు అనుగ్ర హించుటకై వారి యిష్టదైవమగు శ్రీ నరసింహస్వామిని ప్రార్థించుచున్నాను.

"సరస్వతీ శ్రుతి మహతాం మహీయతాం"

హైదరాబాదు
26/3 ఆర్‌టి, బర్కత్‌పుర,
14-6-1985.

విద్వత్కవి విధేయుడు
కేశవపంతుల నరసింహశాస్త్రి

# అధికార భాషాసంఘం
# ఆంధ్రప్రదేశ్

పద్మశ్రీ, కళాప్రపూర్ణ
డా॥ సి. నారాయణరెడ్డి,
ఎం.ఏ; పి.హెచ్.డి; డి.లిట్.

సచివాలయము
హైదరాబాదు- 500 022
తేది. 17-5-1985

లేఖ నెం. 255 అధి.భాష/85.

శ్రీ నాంపల్లిగారికి,

మీరు పంపిన 'జీమూతవాహనుడు' పద్యకృతి చదివాను. నాగానందం నాటకంద్వారా సంస్కృతభాషలో ప్రసిద్ధమైన జీమూతవాహనుని కథను తీసుకొని మీరు పద్యకావ్యముగా రూపొందించినందుకు అభినందిస్తున్నాను. సరళ శైలిలో ధారాళంగా సాగిపోయిన మీ కావ్యాన్ని మిత్రులు కుంట భాస్కరరెడ్డిగారికి అంకిత మిచ్చినందుకు సంతోషిస్తున్నాను. ముందు ముందు మీ పద్యశైలి మరింత ప్రౌఢి మను సంతరించుకుంటుందని ఆశిస్తున్నాను.

సి.

# అభిప్రాయము

అవధానచక్రవర్తి,
శతావధాన సార్వభౌమ
**మేడసాని మోహన్**
యమ్.ఎ, పిహెచ్.డి.

అన్నమాచార్య ప్రాజెక్టు
తిరుపతి- 517 501

శ్రీ దూడం నాంపల్లిగారు రచించిన జీమూతవాహన పద్యకావ్యము నామూలాగ్రముగ చదివితిని. వీరి రచన ప్రసన్నశైలీభరితమును, ధ్వనిత్యర్థస్ఫోరకమునునై రసజ్ఞుల మనంబులకు నానందదాయకముగా నున్నదని చెప్పనొప్పును. వీరింకను అనేక రసస్ఫోరక కావ్యములు రచించి వాగ్దేవి నలంకరింతురుగాతమని ఆకాంక్షించుచున్నాను.

మేడసాని మోహన్

22-4-1985.

# ప్రశంసా ప్రవాళము

వేముగంటి నరసింహాచార్యులు
సిద్దిపేట (మెదకుజిల్లా)

కం॥ జీమూతవాహు చరితము
కోమలమగు శైలికృతిగ గూర్చి సహృదయ
స్తోమమ్మున కెంతేనియు
ఆమెత లొసగితివి కవివరా! నాంపల్లీ !!

కం॥ నీతులు, సూక్తులు, చక్కని
జాతీయమ్ములును, మంచి సామెతలును సం
ప్రీతి గలిగించు కవితా
రీతులతో నలరు నీదు కృతిని నుతింతున్.

కం॥ నాకవన సుమమధూళీ
పాకము వెలయించు మధుర భావాన్వితమై
నీ కవనము భాసిల్లును
ధీకలితా ! సుకవితానిధీ ! కృతచరితా !!

కం॥ కెంపులు, పచ్చలు గూరిచి
సొంపగు హారమ్మువోలె శోభిల్లును నీ
యింపైన పద్యరచనము
నాంపల్లి కవీంద్ర! రుచిర నవభావకృతీ !!

గీ॥ రాగతాళవిన్యాస సంయోగ కలన
కెరలు గానమ్మువలె తావకీన కవిత
మృదుల మధుర శబ్దార్థ సమ్మేళనమున
వెలయుచుండు నాంపలి కవిప్రకాండ !!

# అభినందనము

కవి శిరోమణి, అవధాన యువకేసరి,
మధురకవి, వాస్తుశిరోమణి
**డా॥ అందె వేంకటరాజము** ఎం.ఏ; పిహెచ్‌డి.
(ఆంధ్రోపన్యాసకులు)

మిత్రులు సుకవివర్యులు మా భారతీ సాహిత్యసమితి సభ్యులైన శ్రీ దూడం నాంపల్లిగారు చక్కని కవులు, పండితులు, సహృదయ లలాములు. వీరు గతములో శకుంతల, పాండవ జననము, శిష్యద్వేశతి వంటి కృతుల నెన్నియో రచించి సహృదయ సాహితీపరుల మెప్పుగాంచి యున్నారు.

ప్రస్తుతకృతి 'జీమూతవాహనుడు' దయావీరమునకు జగత్ప్రశస్తి వహించిన విద్యాధర చక్రవర్తి జీమూతవాహనుని దివ్యచరిత్రము. ఈ విషయము సంస్కృతనాటకముగా శ్రీహర్షుడు వ్రాసిన 'నాగానందము' సుప్రసిద్ధమైనది. ఈ కావ్యమున ఆచారిత్రము సరళ సుందరముగా రసవంతముగా సంతరింపబడినది. ఇందు భావములు, ఉపమాద్యలంకారములు, లోకోక్తులు ముఖ్యముగా సంస్కృత లోకోక్తులు నవరింపబడి ఆహ్లాదము కలిగించుచున్నవి. ఇవి వీరి సంస్కృతాంధ్ర వైదుష్యమునకు అద్దము పట్టుచున్నవి.

వీరింకను మునుముందు విస్తరకవితా విరాజితములగు రసవత్కావ్యఫల రాజములను పండించి ఆంధ్రసాహితీ జగత్తునకు పుష్టిని తుష్టిని వెలయింతురుగాక! యనియు, కృతికర్తకు కృతిభర్తకు శ్రీ సర్వమంగళాదేవి అభ్యుదయ పరంపరలు ప్రసాదించవలెననియు శుభాకాంక్ష లొనర్తును.

ఇతిశమ్.

ఇట్లు
డా॥ అందె వేంకటరాజము
అధ్యక్షులు
భారతీ సాహిత్యసమితి.

కోరుట్ల- 505 326
1-10-1985

# నామాట

పరోపకారపరాయణుడు, పితృసేవా తత్పరుడు, కరుణామయుడు అయిన జీమూతవాహనుడు త్యాగధనులలో ఒకడుగా ప్రసిద్ధి గాంచినాడు. కపోతమును కాచుటకొరకు స్వీయోరువును కోసియిచ్చిన శిబిచక్రవర్తి వలె, వజ్రాయుధ నిర్మాణమునకై తన వెన్నెముకను త్యాగమొనర్చిన దధీచివలె ఒక నాగుని రక్షించుట కొరకు తన తనువునే అర్పింపదలచినాడు జీమూతవాహనుడు. 'పరోపకారార్థమిదం శరీరం' అన్న ఆర్యోక్తికి ప్రతిరూపముగా వెలసినాడు జీమూతవాహనుడు. ఆతని సుగుణములను మెచ్చియే కాబోలు! తచ్చరిత్రమును కావ్యముగా వ్రాయుమని మిత్రులు శ్రీ కుంట భాస్కరరెడ్డిగారు నన్ను కోరినారు. వారి కోరికమేరకు నాచే మలచబడిన పద్యకృతియే ఈ 'జీమూతవాహనుడు.'

'ఉన్మీలనము' అను పేరుతో ఈ కావ్యమునకు మనోజ్ఞభావాత్మకమయిన చక్కని పీఠికను అలంకరింపజేసిన విద్వత్కవులు, సహృదయులు ఐన శ్రీమాన్ కేశవపంతుల నరసింహశాస్త్రిగారికి ఎంతయు కృతజ్ఞతలు. అమూల్యాభిప్రాయములను అందజేసిన గేయకవి చక్రవర్తి, పద్మశ్రీ డా॥ సి. నారాయణరెడ్డిగారికి; విద్వత్కవులు, కవికోకిల శ్రీ వేముగంటి నరసింహాచార్యులగారికి; శతావధాని శ్రీ మేడసాని మోహన్‌గారికి; మధురకవి, అవధాన యువకేసరి శ్రీ అందె వేంకటరాజము గారికి; ఈ కృతి కన్యకాముఖమున పంచవర్ణచిత్ర తిలకమును తీర్చిదిద్దిన చిత్రకారులు శ్రీ ఆగాచారిగారికిని కృతజ్ఞతలు తెలుపుకొనుచున్నాను. స్వీకర్తయైన శ్రీ కుంట భాస్కరరెడ్డిగారు 1986 ఫిబ్రవరిలో స్వయముగా అచ్చువేయించుకొన్న తొలిముద్రణ ప్రతులన్నియు అచిరకాలములోనే అయిపోయినందున మిత్రుల కోరికపై మరల ముద్రింపవలసి వచ్చినది. ఈ మలిముద్రణకు అడిగిన తోడనే ఆర్థిక సహకారమందించిన శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానము వారికి ప్రత్యేకముగా కృతజ్ఞతాభివందనములు సమర్పించుకొంటున్నాను.

-దూడం నాంపల్లి

# కృతి సమర్పణము

"సరసుడు సుహృదుండగు భా
స్కరరెడ్డికి ఇట్టి కృతిని కరదముగా సా
దరముగ అంకితమిచ్చెద
చిరత్న సహవాసమునకు చిహ్నముగాగన్."

—దూడం నాంపల్లి



కృతి కర్త
దూడం నాంపల్లి



కృతి భర్త
కుంట భాస్కర రెడ్డి

# జీమూత వాహనుడు

## (పీఠిక)

శ్రీలోలాక్షి నెడంద సుస్థిరముగన్ శ్రీవత్సమన్ మచ్చతో
వాలాయంబుగదాల్చి భక్తతతికిన్ శ్రేయసంబిచ్చు త
చ్ఛ్రీలక్ష్మీ నరసింహదేవుడు దయన్ రేపాక పుర్యర్చితుం
డేలున్ భాస్కరరెడ్డి కుంటకులు నెంతే పెంచుచున్ శ్రీలతన్. 1

ఆ.వె. శ్రీమదాంధ్రరాష్ట్ర భూమిలో తెలగాణ
సీమ కరిమునగరు జిల్లయందు
తనరెడు సిరిసిల్ల తాలూకలోన రే
పాక గ్రామమొండు వరలుచుండు. 2

సీ. వీథి దీపాలతో వేయివెల్గుల మించి
పగలుగా రాతిరి పరిఢవిల్ల,
పురజనమ్ముల బ్రోవ 'బోరింగు బావులు'
పాతాళగంగను పైకిజిమ్మ,
ఇరుగెలంకుల రెండు చెఱువులుండి పురికి
పైరుపచ్చల నించి పంటనిడగ,
చదువుసాములునేర్పి సామర్థ్యమునుబెంచు
అధ్యాపకోత్తము లలరుచుండ-
ఊరి తూర్పున గుడినున్న నారసింహు
డెల్లవేళల బ్రోవ నింటిల్లిపాది
పాడిపంటలు గలిగి రేపాక ప్రోలు
ప్రణుతికెక్కెను భూతల స్వర్గమనగ. 3

కం. ఆ పురమున రైతొక్కడు
కాపురమున్నాడు తోడికాపుల తోడన్
దీపిలు కుంటకులాబ్ధిక
లాపుడు బాగాఖ్యరెడ్డి లలితోక్తుండున్. 4

ఆ.వె. తాను తొల్లిట 'అమిదాపురం' నుండి రే
పాక గ్రామమునకు వలసవచ్చి
కాపురమ్ముచేయ కలిగె 'నర్సమ'యందు
రమ్యగుణసుతుండు రాజిరెడ్డి. 5

సీ. పాతాళమంటెడులోతు సంగడిమోట
బావిని ద్రవ్వించె నేవరారి,
'పత్తె' నీటినిబెంచి వరి కారుకెనుబది
పుట్లు పండించెనే బుద్ధిశాలి,
ప్రత్తిమిర్చియు మెట్టపంటలు నపరాలు
రాసులబోసె శ్రామికుండు,
సాలుసాలున పదివేల రూకలు వచ్చు
మావితోటనుబెంచె నేవలంతి
అతడు తోడిరైతులమించి యనవరతము
ధాన్యలక్ష్మి విశాల సదస్సునందు
రెడ్డిగము వైచి కొలువున్న రెడ్డిరాజు
రాజిరెడ్డి నిజమ్ముగా రైతురాజు. 6

కం. ఆ రాజిరెడ్డికి సదా
చారిణి రామమ్మ ధర్మచారిణి యగుచున్
కూరిమి కాపురముండగ
వారలకున్ నల్గు రాడుపడుచుల తోడన్. 7

కం. ఔరస్యులు ముప్వురు వీ
రారెడ్డి, నృసింహరెడ్డి, రాంరెడ్డి యనన్
పేరిమి జనించి రందున్
వీరారెడ్డి యనునతడు విద్యాధికుడై. 8

కం. వెక్కువిధమ్ముల 'కేసు'ల
చక్కగ వాదించి విజయసాధకుడగుచున్
చక్కని 'వకీలు'గా పే
రెక్కెను; దక్షుండు పేరుకెక్కడె యెందున్? 9

కం. ఆ వీరరెడ్డిగారికి
ఆవిర్భావమ్మునొంది 'యంతమ' యందున్
జీవను లిరువురు దక్కిరి
జైవాతృక సూర్యులట్లు; చనగ గతాయుల్. 10

తే.గీ. పెద్దకొడుకు భాస్కరరెడ్డి, పిన్నవాని
పేరు భగవానురెడ్డి; ఆ బిడ్డలకట!
పూపప్రాయాన నుండ నా పుణ్యమూర్తి
యసువులనుబాసె 'సుకృతీగతాయు' వనగ. 11

ఆ.వె. తండ్రి స్వర్గమరుగ తనయుల నిర్వుర
కన్నప్రేమ కరుడుగట్ట నెట్లొ
విద్దెబుద్ధిచెప్పి పెంచిపెద్దలజేసె
తల్లి అంతమాంబ ధన్యురాలు. 12

ఆ.వె. ప్రథమ పుత్రుడైన భాస్కరరెడ్డి తా
చదువు సంధ్యలెల్ల చాలనేర్చి
పంతులయ్యె 'బియ్యె' పట్టభద్రుండయ్యె
మాన్యుడంచు మించి మంతుకెక్కె. 13

తే. గీ. పరుల మనముల నొప్పించి యెఱుగబోడు
పరుషమనుమాట కలనైన పలుకబోడు
డంబమే యెఱుంగని నిరాడంబరుండు
సాధువర్తను డాతడు సాత్త్వికుండు. 14

తే. గీ. వృత్తి ఆచార్యకమ్ము, ప్రవృత్తి ధర్మ
స్మృతి జరించుటల్, తన కులవృత్తి యూర
సేద్య మొనరించుటల్ మరి చిత్తవృత్తి
హృన్నివేదన మా గుణావృతున కొప్పు. 15

కం. భాస్కరునకు ఛాయవలె, పు
రస్కార క్రియల నలరి ప్రణయమెసంగన్
భాస్కర రెడ్డికి నొప్పె య
శస్కర గుణమణి మణమ్మ సహధర్మిణియై. 16

తే. గీ. ఆమె మంజులవాణి, మహాభిమాను
రాలు, నైష్ఠికశీల, చుట్టాల సురభి,
కొంగుబంగార మామె యనుంగుచెలుల
కేన్గుపాడియే తా దానమిచ్చునేని. 17

కం. తలలో నాలుకవలె, పూ
సలలో దారమ్ము వోలె సద్వర్తనతో
తలపూవాడక పాల్పి
ర్వాలెన్ మెలంగును మణమ్మ ప్రాణేశునితో. 18

కం. ఆ పుణ్యదంపతులకున్
వేపుట్టిరి పూర్వపుణ్య పృథుఫలితముగన్
రూపరి 'రఘుపతిరెడ్డి'యు
చూపరియున్ 'రమణరెడ్డి' సుతులిద్దరిలన్. 19

తే.గీ. వీరరసమున సింహపు పిల్లలట్లు
శాంతరసమున ధర్మజు సరణినొప్పి
తల్లిదండ్రుల చెప్పుచేతల మెలంగు
ఆ కుమారుల సుగుణ మేమనగవచ్చు ? 20

కం. అవ్వారి కూరి పడమట
రవ్వలు పండించు క్షేత్ర రాజంబొండున్
దవ్వున గల దద్దానికి
త్రవ్వించిరి నీళ్ళకై 'కరంటుంబావి'న్. 21

కం. అక్షరహీనంబయి దు
ర్భిక్షములో బావులెల్ల బీటలు వాఱన్
అక్షీణ జలమ్ములతో
రక్షించు పొలాల నా 'కరంటునుయి' సదా. 22

తే.గీ. మాటలాడెడు నంతలో నూటలెగసి
కలభకరముల పరిమాణ కరణిగలిగి
ఊటలా ? కావు, నీళుల బాటలనగ
క్షణములో నిండు నాబావి గుణమెయంత. 23

తే.గీ. పొలమునకు సరిపోయెడు జలముకంటె
హెచ్చునీరిచ్చు నాబావి మెచ్చవలయు
అర్థికోరిన దాని కత్యధికమొప్ప
దానమిత్తురుగాదె ! వదాన్యులెందు. 24

సీ. నేను యథావిధి స్నానార్థము 'కరంటు
బావి'కేగి మునింగి వచ్చునపుడు
ఆ బావి యజమాని యగు కుంటబాస్కర
రెడ్డిగారు మదీయ ప్రియహితుండు

వరిపొలమ్మును జూడవచ్చి నన్వీక్షించి
సల్లాపమొనరించి సాదరముగ
"తల్లిదండ్రులగొల్చి- దయజూచి మిత్రుల-
పరుల మేల్గోరెడు పావనుండు
గలడె ? యెవడైన పృధివిలో- గలిగెనేని
యతని జన్మంబు ధన్యంబెయగు" నటన్న
"కలడు జీమూతవాహు డొక్కండు తొల్లి"
యనిన నామాట కాత డిట్లనియె మురిసి. 25

కం. "జీమూతవాహనుం డను
నామహనీయుం డెవండొ ? యాతని చరితన్
నా మనము తెలియగోరెను
నా మిత్రమ ! తెల్పుమోయి ! నా" కని యనుచున్. 26

సీ. "శిష్య ద్విశతి వ్రాసి చెల్వుగ 'సీతివ
చోభిజ్ఞ' బిరుదమ్ము నందినావు,
బళిరే ! శకుంతలా పాండవజననాఖ్య
హరికథల్ విరచించి యలరినావు,
'ధర్మాంగద'యును— 'మదనకామరా'జను
చిరుతల నాటకాల్ చేసినావు
పాండవేయాజ్ఞాతవాసమ్ము- జగదేక
వీరునికథ యను వీథినాట
కములు, భజనకృతుల్ వ్రాసి, కవితలల్లి
పలుప్రశంసలందిన 'తెల్గుపండితు'డవు
ప్రేమ జీమూతవాహను విమల చరిత
మంకితమ్మిమ్ము నాకు పద్యాత్మకముగ". 27

కం. అనికోరిన నేనును నె
మ్మనంబలరి వల్లెయనుచు మందిరమునకుం
జని, తత్కథను కుతూహల
మున పద్యమయముగ వ్రాయబూని, మొదలుగన్. **28**

తే.గీ. కుంట భాస్కర రెడ్డి గారింటవెపుడు
త్రవ్వి తండంబుగా లక్ష్మి తాండవింప
వలచి, జీమూతవాహన పద్యకృతికి-
ఏను వినుచు కథాక్రమం బెట్టిదనిన. **29**



# జీమూతవాహనుడు

## (పూర్వార్థము)

శ్రీ పరమేశ్వర ! సర్వ
వ్యాపక ! వైకుంఠ ! కుంటభాస్కరరెడ్డిన్
కాపాడుము వరదాయక !
రేపాకావన సురంహ ! శ్రీనరసింహా ! !

కం. అవధారు ! మిత్రరత్నమ !
భవదభ్యర్థన గణించి పద్యకృతిగనే
ప్రవచించెద నల జీమూ
తవాహను చరిత్ర మంకితంబుగ నీకున్.

సీ. మున్ను విద్యాధర సన్నుతాన్వయదుగ్ధ
వారాశి చంద్రుడై వరలెనెవడు ?
ధర్మంబు నాల్గుపాదాలుగా నడిపి మ
హా ధర్మమూర్తియై యలరెనెవడు ?
ప్రజలను తనకంటి పాపలుగా ప్రేమ
పాలించి ప్రఖ్యాతి వడసె నెవడు ?
రాజచక్రమునకే రసికావతంసమై
కీర్తికాంతకు కన్ను గీటెనెవడు ?
ఆ మహాత్మకుండు జీమూతకేతుండు
ఖచర వల్లభుండు ఘనబలుండు
మంచు కొండపైన కాంచన పురములో
కనకవతినిగూడి మనుచునుండి.

కం. ఎంతోకాలం బేలుచు
స్వాంతంబున రాజ్యకాంక్ష చచ్చియతడు "రా
జ్యాంతే నరకం ధ్రువ"మని
చింతించి వనంబులో వసించు తలపుతో. 4

తే.గీ. తనర జీమూతకేతుండు తన కుమారు
చతురు జీమూతవాహను సార్వభౌమ
పదవి సుప్రతిష్ఠితుజేసి వార్ధకమున
వానప్రస్థంబు గొనియె సభార్యుడగుచు. 5

తే.గీ. అంత జీమూతవాహనుం డాత్మరాజ్య
పాలనంబెల్ల తనమంత్రి వశమొనర్చి
తల్లిదండ్రుల సేవింపదలచి వనికి
తరలిపోసిద్ధమై యున్న తరుణమందు. 6

కం. తనమిత్రుం డాత్రేయుం
డనెనిట్లు వినమ్రుడగుచు "అక్కట! జననీ
జనకులతో వనవాసము
చనగన్ మీకేల ? విగత సామ్రాజ్యుడవై. 7

కం. క్షామము దొలగించి, ప్రజా
క్షేమము కాంక్షించి మించి క్షితిభరణమునన్
భూమి రమణుడను సార్థక
నామము గైకొనుట మీకు న్యాయ్యముగాదే! 8

కం. ఏకచ్ఛత్ర ప్రభుతన్
గైకొనక, కరగ్రహణముగాక, సుఖములన్
పోకడ బెట్టుచు వనులకు
పోకడ మీకేల ? వయసుపోయెనె మీకున్ ? 9

కం. పూజ్యులు మీకీరాజ్యము
త్యాజ్యమ్మగునెట్లు ? మీరు తగరె పదవికిన్ ?
"రాజ్యమ్ము వీర భోజ్యము"
పూజ్యోక్తి నెఱుంగలేవె ? పూతచరిత్రా ! 10

తే.గీ. ప్రజల రంజించి పాలించు ప్రభులు మీరె
వనుల కరిగిన జనులెట్లు మనుదురయ్య !
సార్థకమ్మెట్లు ? మీయట్లు సచివుపాల
నమున "రాజా ప్రకృతిరంజనా"త్తను స్మృతి. 11

మ. పరిపాలించి సమస్తమౌ ప్రజల "భూ పానాం ప్రజాపాలనం
పరమోధర్మ" యటన్న నీతికెనయై ప్రజ్ఞా ధురీణుండవై
సరి నీకెవ్వరు లేరటంచు బొగడన్ సత్కీర్తి మంతుండవై
చరితార్థుండవు గమ్ము నెమ్మి విలస చ్చారిత్ర సంప్రాతవై. 12

తే.గీ. అదియుగాక విను— మతంగహతకుడొకట
పొంచియుండె రాజ్యమ్ము హరించు కొరకు
ప్రక్కలో బల్లెమైయున్న పగఱబాపి
ప్రజల గాచుట రాజధర్మంబుగాదె ? 13

కం. పూజ్య సుఖస్థంబగు సా
మ్రాజ్యమ్మది శాత్రవుల కరస్థంబగుచో
వ్యాజ్యెమ్మయి భాజ్యమ్మయి
పూజ్యమ్మౌ యగును మీరు పోయిన పిదపన్. 14

కం. "నా విష్ణుః పృథివీపతి"
కావున సామ్రాజ్యరక్ష గైకొని జనులన్
బ్రోవగవలయును, మీకున్
దేవర ! నేజెప్పునట్టి దీశాలినటే ?" 15

కం. నావుడు రాజిట్లను 'పితృ
దేవోభవ' యనుచు 'మాతృదేవోభవ' యం
చావేదమ్ములు వల్కుట
నీ వెఱుగవె ? చెప్పవలయునే ? నేనీకున్. 16

ఆ.వె. మాతపితల మించు మహితదైవమ్ములు
ధరణియందు గలరె ? తలచిచూడ
ప్రత్యహమ్ముగాంచు ప్రత్యక్షదైవాలు
వారుగాక వేరెవారు గలరు ? 17

కం. మాతాపితరుల సేవకు
భూతలమున దూరమైన పురుషుడు నరకా
పాతము గొని రెంటను జెడు
లే! తొలి 'రెంటికిని జెడినరేవని' భంగిన్. 18

తే.గీ. మాతృ పితృదేవుల భజన మదిని మఱచి
ఇహపరమ్ముల కెడమై తపించువారి
కావగలవారు లేరు జగానవేరె
యఘుల మన్నించి ప్రోచు ననఘులువారె. 19

కం. గురుతములగు తలిదండ్రుల
సురుచిరముగ సంభజించు సుజను డిహమునన్
దరియించి పొందు నిక్కము
పరమున కరబదరమట్లు స్వసౌఖ్యంబున్ 20

ఆ.వె. కనుక నేను నాదు జననీజనకుల న
పారభక్తి మదిని పాదుకొనగ
సంభజింతు" ననిన సఖ్యు డాత్రేయుండు
మారుపల్కకుండ నూరకుండె. 21

సీ. జనయిత్రి జనకుండు చనుదేర సఖుడు వెం
బడిరాగ జీమూతవాహనుండు
వనమధ్యమున కేగి వసియించి పితృసేవ
గావించుతటి కొంతకాలమునకు
జీమూతకేతువు జీమూతవాహను
చేరబిల్చి యనుజ్ఞ చేసెనిట్లు
"పుత్రక! యిచ్చోట పూలు దర్భలు కంద
మూల ఫలాదులు చాల తఱిగె
గాన, నాత్రేయుతోగూడి క్రన్ననరిగి
మలయగిరిపైన సుందరస్థలము జూచి
మంచియాశ్రమంబొండు నిర్మించుమచట
నింకముందర బ్రతుకు సాగింత" మనిన. 22

కం. శత్రుండును మిత్రుండును
అత్రమ్మున చనిచని మలయాద్రిపయిన్ స
త్పాత్రమ్మగు నొక్క తపః
క్షేత్రమ్ము దరిసి తదీయసీమ నిరతమున్. 23

సీ. భయమింతయునులేక బర్హిబర్హమ్ముల
నీలడ వసియించు వ్యాడములను
సింధురమ్ములు చిమ్ము శీకరమ్ముల దోగి
శీతలించి సుఖించు సింహములను
పొరపొచ్చెమును లేక పొందిక నొక్కచో
దిరుగు మృగాదన హరిణములను
అంగమంగ మొరసి యబ్బాడు నాలతో
దోబూచులాడు శార్దూలములను

సఖ్యముననాడు హర్యక్ష శరభములను
కలిసి విహరించు మార్జాలఖనకములను
గాంచి, యది తపోనిలయంబ కాదలంచి
మిత్రులిర్వురు పులకిత గాత్రులైరి. 24

కం. అవిరళ హోమజపాదుల
ప్రవిమల సత్సామగాన పారాయణమున్
ప్రవచన పఠనంబును దవు
దవులన్ దిలకించినారు ధన్యులు వోలెన్. 25

ష.గీ. అచటి వృక్షవిశేషమ్ము లరయుచుండి
హోమవాసనల్ పీల్చుచు నుత్సుకతను
ఆశ్రమస్థలము వెదకు నవసరమున
పరుల మేల్గోరు సద్భావపరతనేమొ!
క్రమవీణా క్వణముదెచ్చి గంధవహుడు
వారి వీనుల బడవైచె పనివడివడి. 26

కం. "ఆ వీణానిక్వాణం
బే వైపున నుండి వచ్చెనేమొకొ!" యనివా
రా వైపు చనిరి కాంచిరి
దేవాయతనమ్ము నొక్క దివ్యస్థలమున్ 27

సీ. ఆదివ్య దేవాలయమ్ములో చెలులతో
తరుణి యొక్కర్తు సుతారముగను
గౌరినుపాసించు గానమ్ముతోడ వీ
ణావాదనమ్ము నొనర్చుచుండ
కనుల కరువుదీర గనుగొని జీమూత
వాహనుండు మదిని మోహపడుచు

"అలరు పద్మపురేకులట్లు చేడియలుండ
మధ్యకర్ణిక యట్లు మగువదోచె
బళిరె! దీనిసౌరు పరమాద్భుతంబు, న
పూర్వమౌర! గానమును గనుగొన-
దీని బొందు వానిదే భాగ్య" మంచు తా
వలపుగదుర నింక దలచెనిట్లు. 28

సీ. "ఇక్కాంత ముఖకాంతి యెంతేని వెలుగొంద
రాకాసుధాకరు రమణయేల?
ఇన్నాతి కనుల సౌరెంతేని యలరంగ
చెల్వంపుగల్వల చెల్వమేల?
ఇన్నారి చనుల పొంగెంతేని మెఱయంగ
కుంభికుంభమ్ముల జృంభమేల?
ఇన్నెలంతుక మధ్యమెంతేని కృశియింప
మవ్వంపు హరిమధ్య మాత్రమేల?
యనగనొప్పు నిర్మలాస్య నమలనేత్ర
గుబ్బలాడిని తనుమధ్య గోర్కెమీఱ
పరిణయంబాడి సుఖియించు వాడెవండొ?
వాని భాగ్యంబె భాగ్యంబు పరిగణింప. 29

కం. ఈ తరుణి బోలు తరుణి 'న
భూతోనభవిష్యతి' యనబోలున్నెలన్
ప్రీతిగ నాపత్నిగ ఈ
నాతిన్నె బడయకున్న నా పుట్టేలా? 30

కం. ఎప్పు డధర్మపు జనులన్
చొప్పడని మనంబు నిట్టిచోటున నేడీ
కప్పుర గందింగోరగ
చొప్పడియెన్ నొసటి వ్రాత చొప్పెటు గలదో? 31

తే.గీ. ఐన, నామానసంబిమెయందు కరము
లగ్నమైయున్న, దీస్త్రీలలామ నాకు
గరితయయ్యేడు గాబోలు! కాకయున్న
అన్యధా యిట్టు మదియెట్టు లభిలషించు." 32

ఉ. అంచు దలంచుచున్ మరల నంతనె సందియమొంది "యిట్టులీ
పంచన కన్యకామణుల బంగరు బొమ్మల ముద్దుగుమ్మలన్
గాంచగవచ్చొ! లేదొ!" యని గాదిలి మిత్రునితో వెసన్ బొదన్
బొంచెను రాకుమారకుడు పొల్తి చరిత్రమెఱుంగు కోరికన్. 33

సీ. అంతట చతురిక యనియెడు చెలికత్తె
మలయవతిని గాంచి పలికెనిట్లు
"కాంతరో! నీవింత కాలంబుగా గౌరి
నెదను ప్రతిష్ఠించి యెంతొ భక్తి
చేసిన పూజలు, చేసిన వ్రతములు
నీసేవ లిల బూదిబోసినట్టి
పన్నీరెయయ్యె; కాకున్నచో నాదేవి
నీ యభీష్టము పూర్తిచేయకున్నె?
రాతిగుండె దైవ మేతీరు కరుణించు
జాలమేల చేయు జాలియున్న
కన్నెలెవరు పడని కడగండ్ల బడితింక
నీ ప్రయత్నమది వృథా ప్రయాస. 34

కం. మ్రొక్కగ చేతులు గోసెడు
మొక్కలి దైవమ్ముగలదె? మ్రొక్కిన వరమున్
నిక్కము దీర్పని వేల్పును
గ్రక్కున విడువంగవలయుగదె! మలయవతీ!" 35

కం. అనవుడు తద్వచనంబుల
కును బాధితహృదయ యగుచు కోపము గొనుచున్
అనియెను మలయవతి యిటుల
తనదేవివి దూరుకతన తనచెలితోడన్. 36

కం. "నాకుం గలలో గనుపడి
ఆ కాత్యాయని వచించె నాదరమొప్పన్
'నీకైంకర్యంబునకున్
నాకున్ ముదమయ్యె గావునన్ ప్రతిఫలమున్. 37

కం. నీకీయగ నేవచ్చితి
నో కన్నియమిన్న! నీ మనోభీష్టమ్మున్
చేకురునట్టుల వరమున్
నీకున్ దయచేయుచుంటి నిజమెట్లన్నన్. 38

ఆ.వె. నిన్ను చెట్టవట్టు నెఱవాది జీమూత
వాహనుండు ఖచర వల్లభుండు
వానివలన నీకు వరకీర్తి సౌఖ్యమ్ము
గలుగు' నంచు తాను బలికెగాన. 39

కం. కష్టముల కోర్చి యిన్నా
ళ్ళిష్టముగా గౌరికి నొనరించిన సేవల్
నష్టంబగునే? సఖియా!
'కష్టీఫలి' యన్నమాట కాదనగలమే?" 40

ఆ.వె. అనిన విని చతురిక యానందభరితాత్మ
యగుచు రాకుమారి కనియె నిట్లు
"ఇంతకాలమునకు ఇంతిరో! నీకోర్కె
తీరుచున్న దిక విచారమేల? 41

ఆ.వె. గౌరి స్వప్నమందు గాన్పించి పలుకుట
కన్య! నీదు పూర్వపుణ్యమమ్మ!
కల నిజంబయైన వలసినదేమి? నీ
భాగదేయమెంతొ ప్రబలమమ్మ! 42

కం. వరవిద్యాధర వరునిన్
వరునిగ నీ కొనరజేయు వరగౌరీస
త్కరుణకు నేమనవలయును
వరవర్ణిని! నీ తపస్సు ఫలియించెగదే! 43

ఆ.వె. మాకు కౌతుకంబు మరిమరి హెచ్చెబో!
నీకు కౌతుకంబు నిక్కమగుట
కక్కవచ్చునేని కల్యాణమగునేని
ఆగునేల? పూర్తి యగునుగాని." 44

ఉత్సా. అంచువార లిట్లు మాటలాడుచుండు నంతలో
పొంచియున్న ధారలపుడె పొదను వెడలవలయునం
చెంచి యంచయాన లెదుట నేర్పడ కనుపించినన్
కాంచి మించుబోడులెల్ల కరము వెరగుజెందుడున్. 45

కం. కాంత మలయవతి యెంతయు
స్వాంతమ్మున వింతగదుర భ్రాంతమ్ముగతత్
కాంతున్ గనుగొనె నపరజ
యంతున్ కంతున్ వసంతు నా ఖచరేంద్రున్. 46

సీ. ఘన కవాటమును దచ్చనసేయగా నోపు
గురుతరంబగు పేరటురము నరసి,
కరికరంబులనేని పరిహసింపగ జాలు
నురుతరాజాను బాహువుల నరసి,

చంద్రశకల్కములు పిసాళింపగా నేర్చు
 చిక్కనౌ చక్కనౌ చెక్కు లరసి,
మేటి సింగపుకౌను సాటిగాదనిపించు
 కడుపేదయైన నెన్నడుము నరసి,
గంధసింధురమ్మును మీఱు గమనమరసి,
కైరవమ్ముల విధమొప్పు కన్ను లరసి,
 పద్మమును బోలు నాతని వదన మరసి
ఆ మలయవతి మోహాబ్ధియందు దోగె. 47

కం. "చెలువమున వాసిగాంచిన
నలకూబరు డౌనా! కాక నాకేశుండో!
ఫలకాక ద్రోచె నన్నీ
వలరాజసముం డెవండొ? వశమే తెలియన్?" 48

కం. పలికెను ఆత్రేయు డపుడు
"పొలతులు! మీరిట్లు భ్రాంతి పొందగనేలా?
తెలియరె! మీ మలయవతికి
కలలో నుమ పలికినట్టి ఘనుడీతండే! 49

కం. జీమూత వాహన లస
న్నాముడు, విద్యాధరకుల నాథుం డితడీ
కోమలికిం దగిన వరుడు;
కామితమీడేరె నిట్లు గారీకరుణన్. 50

కం. తొలిచూపులోనె మీచెలి
వలచె నితనిజూచి, యితడు వలచెను నీమెన్;
వలచినవారిని గూర్పగ
వలె, మీ సమ్మతిని తెలుపవలయుంజుమ్మీ!" 51

ఆ.వె. అనవుడు బిడియమున నాత్మప్రియుని గాంచ
లేక యచట నిలువలేక చెలిని
"పదవెపోద" మనుచు కదలిపో నాత్రేయు
డనియె మలయవతికి నాదరమున. 52

కం. "అమ్మా! మలయవతీ! గే
హమ్మున కరుదెంచు నతిథి నభ్యాగతులన్
సమ్మానింపక పోవుట
పొమ్మనకయె పొగనుబెట్టు పోడిమిగాదే! 53

ఆ.వె. రాకుమారివయ్యు రాచమర్యాదల
నెఱిగి కూడ యిట్టులేమఱిల్లి
తడయుచుంట మీకు ధర్మంబె? మారాజ
పుత్రు సత్కరింపబూనవలదె? 54

తే.గీ. 'అతిథి సత్కారమునకంటె నధికమైన
ఫలములేదండ్రు పెద్దలీ పట్టునందు'
అతిథి సేవింప లభియించు యజ్ఞఫలము
వినరె? 'యభ్యాగతస్స్వయం విష్ణు'వనగ." 55

కం. అనవుడు చతురిక వారిని
వినయంబున గౌరవించి విందొనరింపన్
చనుదెంచె నపుడు పానక
మున పుడకతెఱంగు మౌనిపుత్రుండొకడున్. 56

ఆ.వె. వచ్చి, మలయవతికి వచియించెనిట్లు "మా
ధ్యందిన సవన సమయంబు దరిసె
గాన, కౌశికుండు క్రన్నన దోడ్కొని
రమ్మటంచు బుచ్చె రాగదమ్మ!" 57

కం. కులపతి కౌశికు నానతి
మలయవతి యతిక్రమింప మనసొప్పక-ఆ
వలకాని విడువనేరక
బలిమిని జనె మరలి మరలి పరికించుచుతాన్. 58

కం. కులపతి యాజ్ఞప్రకారము
మలయవతి చనినదె కాని మనసు మనసునన్
నిలువక ప్రియునిన్ దలచుచు
వలవంతమునింగి వంతపడుచుండెనటన్. 59

ఆ.వె. పలుకబోదు చెలులు పల్కరించిన గాని
పలుకు తనకుతానె పిలువకున్న
కలువరించునొకట పలవరించు నొకట
కలతనిద్ర దగిలి కలగునొకట. 60

ఆ.వె. ఏదొ పోయినట్టులెంతో దిగుల్పడు
అదియె దొరికినట్టు లపుడె మురియు
పొలతి మాటచేత పొంతనే వేఱయ్యె
ప్రేమ గుడ్డిదన్న విధమిదేమొ! 61

కం. మూసిన తెఱచిన కనులున్
చూసినటు మనోహరుండె చూడ్కుల నెగడన్
ఆసతికి సర్వ మతడై
భాసిల్లె, మనోవ్యధయును భారమ్మయ్యెన్. 62

సీ. మలయవతి యిటుల మరుబారి కోర్వక
విరహ తాపమ్మున వేగుచున్న
చతురిక యామెను చందనగృహమున
కుం దోడుకొనిపోయి చందుచటు

సెజ్జపై శయనింపజేసి శీతోపచా
　　రమ్ములు గావించి "అమ్మ! యిటుల
ప్రియునికై నీవింత వెతనొందగానేల ?
　　జరుగు మీకు నిజమ్ము పరిణయమ్ము"
ననవు డనియె నామె "యానాడు సుంతైన
మాటలాడకుండ మౌనమూన
నను గురించి యేమి యనుకొనెనో తాను,
నా ప్రవర్తనమ్మనార్య మగుట." 63

కం. దానికి చతురిక పలికెను
"మానిని! నీ విట్లు బిట్టు మరుగగనేలా ?
నీ నాథు డాత డగుటన్
తానన్యవిధమ్ము మదిని తలచునె ? తల్లీ! 64

కం. నీ వలెనే నీ ప్రియుడును
భావ భవానల శిఖాశిబాధిత తనుడై
భావింపడె ? నిన్నచ్చట
నో వనితా! విరహచింత నోర్చిన మేలా." 65

తే.గీ. అచట జీమూతవాహనుం డామెవలెనె
మన్మథ వ్యథకు గురియై మరగుచుండి
తాప మడగించుకొనగ చందనగృహమ్ము
చేరబోయెను సఖునితో శీఘ్రముగను. 66

ఆ.వె. వారి రాక జూచి వైదొలంగిరి వేగ
మలయవతి చతురిక మాటువడుచు
సఖ్యు లిరువురాడు సంభాషణంబును
విన కుతూహలంబు పెనగొనంగ. 67

కం. పాత్రములో పలురంగుల
నాత్రేయుడు రంగరించి యాయితపఱుపన్
చిత్రముగా మలయవతీ
చిత్రమ్మను గీసి సంతసించె ఖచరుడున్. 68

ఆ.వె. "జాతిపైన నతడు వ్రాసిన యాబొమ్మ
నాదెయగునా ! వేరె నాతిదగునా !
తెలియవలయు"నంచు మలయవతీదేవి
వేచి చూచుచుండె వేడ్కమీఱ. 69

సీ. చిత్రమ్ము వేడ్క వీక్షించుచు జీమూత
వాహనుండు విమోహవశ్యు డగుచు
"కేశలా ? కావివి కిసలయంబులుగాని,
కన్నులా ? కావివి కలువలగును ;
వాతెఱలా ? కావు పవడంబులగు గాని,
రదనంబులా ? కావు రత్నములగు;
కుచములా ? కావు- లికుచఫలమ్ములుగాని,
ముక్కు గాదిది నువ్వు పువ్వుగాని;
మధ్యమిదిగాదు పిడికిలి మట్టమగును
చూపు లివిగావు వలఱేని తూపులగును
వెలది మీగాళ్ళు కనగ తాబేళ్లె" యనుచు
పలవరించును చెలిచెంత నిలిచినట్లు. 70

కం. ఆపాదమస్తకమ్ముగ
ఆపెను వర్ణించుచుండ నన్యహృదయుడం
చాపాదమస్తకమ్ముగ
ఆపె చలించెను భయాన నాక్షణమందున్. 71

కం. నఖశిఖ పర్యంతం బిటు
సఖి చిత్రమ్మును రచించి సంతసపడు త
త్సఖచిత్ర లిఖితపటిమకు
సఖు డాత్రేయుండు మెచ్చె చాలన్‌జాలన్. 72

కం. నఖశిఖపర్యంతంబిటు
సఖిచిత్రమ్మును రచించి సంతసపడ, త
త్సఖి పెరసఖియని తలచుచు
సఖిమలయ వతియు కలంగె చాలన్‌జాలన్. 73

కం. "ఎవ్వతెనో ప్రేమించియు
నివ్విధముగ బొమ్మగీసి యెంతొ మురియుటల్
అవ్వధు వదృష్టవతియే
నవ్వంబాటయితి నిజమనాథను నేనే. 74

ఆ.వె. గౌరిదేవి పెండ్లి గావింతుననె దుర
దృష్టమేమొ యెదురు తిరుగుచుండె
కనగ 'నొసలు బత్తుడును నోరుతోడే'ల
టన్నవిధము తోచుచున్న దిపుడు. 75

ఆ.వె. ప్రీతిమీరనన్ను ప్రేమించి యాపైన
లాతినాతివలవ నీతియగునె ?
పురుషులందుగల్గు బుద్ధులింతేనొక్కొ!
పుట్టెబుట్టు గుణము బోవునెట్లు ?" 76

ఆ.వె. ఇటులనేకవిధము లేమేమొ యూహించి
కలతపడుచునుండ- మలయవతికి
భ్రాతయైన మిత్రవసువు, జీమూత వా
హనుని వెదకి కొనుచు నటకువచ్చె. 77

ఆ.వె. అతని రాక నెఱిగి యరటాకునొకటి జీ
మూతవాహనుండు బొమ్మ పయిన
గప్పి, రాకుమారు గౌరవక్రియలతో
కూరుచుండజేసి కుశల మడిగె. 78

సీ. మిత్రావసువు ప్రేమమీర జీమూతవా
హను పరామర్శించి యనియెనిట్లు
“సిద్ధరాజుగ సుప్రసిద్ధుడైనట్టి మా
జనకపాదుండు విశ్వావసుండు
మీ సఖ్యమునుగోరి మా సహోదరిని మీ
కిచ్చి పెండిలిసేయ నిచ్ఛగించె
మీ కిష్టమో కాదొ మాకు దెల్పుమటంచు
నన్ను పుత్తెంచియున్నారు గాన-
మీ యభీష్టమేమొ మేమెఱుంగవలయు”
ననిన మిన్నకున్న ననుపుకాని
వైనమెల్ల మలయవతి చాటునుండియే
చూచుచుండె నింక చూతమనుచు. 79

ఆ.వె. వలచియున్న మలయవతియు మిత్రవసుసో
దరియు నొకతెయంచు నెఱుగలేక
అనుగు ప్రియనువదలి యన్యనిష్టపడక
అవును కాదటంచు నతని కనక. 80

కం. జీమూతవాహనుం డపు
డామిత్రావసువుతోడ నల్లన ననియెన్
“నా మాతృపితల నడుగుము
నే మీఱను వారి యాజ్ఞ నిజమీ కొన్నన్. 81

ఆ.వె. వారి కిష్టమయిన వధువు నాకిష్టమే
వారి యిష్టమునకు తారుమారు
నే చరించలేను నిక్కమ్ము నాకీడు
గల్గుదాని చూడగలరు వారె." 82

కం. అనవుడు మిత్రావసువున్
జనియెను జీమూతకేతు సన్నిధికి వెసన్
చనిన యనంతర మాత్రే
యునితో జీమూతవాహు డుస్సురుమనుచున్. 83

కం. "ఇఱుకాటములో నూరక
యిఱికితిమిటు నిక్కువముగ నిచ్చో నడక
త్తెరలో పోక విధమ్మగ
తరణోపాయమ్ము చూడదగు చెలికాడా! 84

కం. అనుకొన్నదొకటి మరి జరి
గినదొక్కటి మనపని తలక్రిందయ్యె సుమా!"
అనుమాటవిని మలయవతి
తననాతడు కాదనెనని తలచి విరక్తిన్. 85

తే.గీ. "అన్న మిత్రావసువు పోవుచున్నదెటకొ
కాంచిర"మ్మంచు చతురికన్ క్రన్ననంపి
ఆత్మహత్యకు పాల్పడి హైమవతిని
మలయవతి యిట్లు ప్రార్థించె మనమునందు. 86

కం. "అమ్మా! గౌరీ! నీదు వ
రమ్మది వమ్మయ్యెనేఁటు, రాగల జన్మన్
నమ్మకముగ పతిగా నా
కిమ్మా! జీమూతవాహునే కేల్మోడ్తున్. 87

ఆ.వె. ఇంతకంటె వేరె యేనేమి కోరను
కోరుకొన్నవాని చేరకున్న
ఎంతవంతొ తెలియదే ? తల్లి ! నీకు మా
కన్నియలుపడు కడగం"డ్లటంచు. 88

కం. అతిముక్తలతల నాబిడ
హతాశ నురిపోసికొనుట కాయత్తపడన్
చతురిక యనుమానాస్పద
మతియై వెనుదిరిగివచ్చి మలయవతిదరిన్. 89

సీ. ఆత్మహత్యాయత్న మాలోకనముచేసి
బావురుమని గుండె బాదుకొనుచు
"ఓ తపోధనులార ! ఓ వనదేవత
లార ! హతాశురాలైన యీమె
ఉరిపోసికొని చావ నుంకించె నరుదెంచి
కావరే ! మీరైన కరుణగలిగి"
యనుచు హాహాకారమొనరింప జీమూత
వాహనుండు పరువువాఱివచ్చి
మలయవతిని గాంచి మరణయత్నంబాపి
కరము వెరగుపడుచు- కలికి క్రియకు
"కతమదేమి ?" యనిన గడగడ వడకుచు
చెప్పె చతురిక యిక తప్పదనుచు. 90

ఆ.వె. "మిత్రవసువు మీ సమీపమ్ము కరుదెంచి
యతని యనుజ బెండ్లి యాడుమనిన
అవునటంచు మీర లప్పుడీకొనక- అ
యుపబావమున వచింపకునికి. 91

ఆ.వె. లాతినాతి బొమ్మ జాతిపైగీసి మో
హాన పలవరించు టాలకించి
మలయవతిని మీరు వలచుటలేదని
వగచి వగచి యిట్టి పనికిబూనె. 92

కం. ఈ మలయవతీదేవియె
ఆ మిత్రావసునకు నిజమనుజాతయగున్
మీమూలముగా నిట్లీ
భామామణి కాత్మహత్య ప్రాప్తంబయ్యెన్." 93

సీ. అనుడు జీమూతవాహనుడు మలయవతిన్
చేపట్టికొనిపోయి చిత్తరువును
చూపింప నామెయు చూచి యయ్యది తన
బొమ్మయే యగుట ముదమ్మునొంది
"జీమూతవాహను చేసికొంటినపార్థ"
మంచు తనకుతానె యాడికొనుచు
కోరినకోరిక తీరినందుకు గౌరి
విరివిగా మదిలోనె వేడికొనుచు
నున్నయంత- చేటి క్రన్నవచ్చి వచించె
"నుభయ పితరులెల్ల నొప్పుకొనిరి
యెల్లి పెండ్లికూడ తల్లి! నిశ్చయమాయె
నన్ననిపిరి నీకు విన్నవింప. 94

కం. కావున నో మలయవతీ!
రావమ్మా! వేగవేగ రాచనగరుకున్
పోవుదమిట తడసినచో
మీవా రెఱగొందు రాజ్ఞ మీఱితివనుచున్." 95

కం. అంచుం దోడ్కొనిపో ద్రప
గించిదనవత వదనయయి శ్రీగంటప్రియున్
గాంచుచు చన గాళ్ళాడక
వేంచేసెను బల్మి దాసివెంట నగరుకున్. 96

కం. జీమూతవాహనుండును
ధామంబునకేగి తల్లిదండ్రుల తోడన్
ఆ మలయవతీ విషయం
బామూలాగ్రముగదెల్పి యానందించెన్. 97

సీ. వెల్లవేసిన తెల్లతెల్లగోడల దిద్ది
తీరిచి తీనెలు తీయువారు
కస్తూరి జవ్వాది కలయంపినిడి రంగ
వల్లులు వాకిళ్ళ పఱచువారు
ప్రతికంబమునకు నప్రతి మమ్ముగా నగి
షీ చిత్రములను రచించువారు
మామిడాకులతోడ తోమాలియలనల్లి
ద్వారబంధములకు తార్చువారు
ద్వాఃకవాటమ్ములకు రంగు ప్రాముువారు
వడిగ తాటాకు పందిళ్ళు వైచువారు,
వచ్చువారును పోయెడువారు దగిలి
సందడించెబో! నాపెండ్లి సంబరమున. 98

తే.గీ. నారికేళపలాశితో నాల్గుదిశల
ద్వారములు కూర్చి కదళిపత్రములజేర్చి
'మేల్‌బళా!' యంచు మెచ్చ నిర్మించిరౌర!
మింటికంటిన పెందిలి మంటపమును. 99

కం. తఱిగొన్న పెండ్లితరుణము
తఱియంబడు బెఱిగి కరము తత్తఱపడుచున్
పరిణయ ఘట్టమునకు మును
గరితలు గఱువలును పెండ్లి కట్టడితోడన్. 100

ఆ.వె. "మైలపోలు"దీసి మంగళప్రదమైన
పూజెగులునుదెచ్చి పూజచేసి
పెండ్లిపోలువోసి, పెండ్లిపీటలపైకి
పిల్ల బిల్లవాని బిలువుడనిన. 101

సీ. ఒకతె చన్గుబ్బలన్ మకరికాదుల దిద్దె
తన్మర్దనమునకు డగినవనుచు;
పారాణినొక్కర్తు పాదాలపట్టించె
పాదపీడనమున వరలుననుచు;
ఒడ్డాణమొక్కర్తె యుంచె లేగౌనున
వరు కరామృతమున వడలుననుచు;
కంకణంబుల నోర్తు కరముల గీలించె
బిగికౌగిలింతల బెనగుననుచు;
గంధమొకతె చెక్కులందు నలందెను
చుంబనములగంట్లు సొగియుననుచు;
చెలువలిట్లు హాళిచే మలయవతి న
లంకరించి రపరరతి యనంగ. 102

కం. చేర్చుక్కగలిగి పాపట,
కూర్చిన చిఱుచుక్క చెంపకున్ శోభనుచే
కూర్చగ, బాసికపు మొగము
వర్చస్సును తొంగలించి వధువు చెలంగన్. 103

కం. పట్టుంధోవతి వరునకు
గట్టింపంజేయ- పైన కండువతోడన్
పెట్టిన భూషల తళుకుల
కట్టిన బాసికమునొప్పి కళకళలాడన్. 104

కం. కన్యావరులను పెండ్లిక
గణ్యముగ నలంకరించి గారవమొప్పన్
పుణ్యస్త్రీల్ తోతెచ్చిరి
మాన్యక్రియవారి పెండ్లిమంటపమునకున్. 105

ఆ.వె. అభిముఖంబుగాగ నావధూవరులు క
ల్యాణపీఠికల నలంకరింప
వారిమధ్య సన్నవస్త్రంబు నొక్కటి
తెరనుజేసి సుంత మఱుగుజేసి. 106

ఆ.వె. కష్టసుఖములందు కలకాల మొండొండు
జంటబాయకుండ సాగుమనగ
పాణిపీడనమును పాదఘట్టనమును
ఒకరిచేత నొకరి కొనరజేసి. 107

కం. జిలకఱబెల్లము నిర్వురి
తలలకు నొత్తింప ప్రేమ దళుకొత్తన్ మం
గళ తూర్యనాదముల మం
గళ సూత్రముగట్టె వధువు గళమున వరుడున్. 108

కం. తలమీఱి యొకరుకొకరున్
దలపడ ప్రేరేచి రెండుతట్టుల చుట్టల్
కలకల నవ్వులు రువ్వగ
తలబ్రాలుం బోసికొనిరి దంపతులు తమిన్. 109

కం. ఆతని చిటి[వ్రే]ల్గొని [ప్రా
పై] తరుణి చరించె సప్తపది సఖ్యముగన్
'నాతిచరామి' యటంచును
ఆతండు ప్రదక్షిణించె హవ్యవహునకున్. 110

తే.గీ. పిల్లకును పిల్లనికి నాగవల్లిజేసి
ప్రత్తిగింజలు నాటించి బ్రాహ్మణుండు
చూపె వారి "కరుంధతిచుక్క" యంచు-
"ఏది ? యే"దంచు చతురిక లెనకమెసగ. 111

కం. విందులు బంధులతో కను
విందుగ కల్యాణమైన పిమ్మట ప్రీతిన్
విందులు బంధులు వందులు
విందున పాల్గొనిరి వా రభేదముతోడన్. 112

తే.గీ. వైభవోపేతముగ నిట్లు వారిపెండ్లి
జరిగిన యనంతరము వధూవరులు గూడి
చనిరి కుసుమాకరో ద్యానవనమునకును
హాయి మీఱగ ప్రేమవిహారమునకు. 113

కం. పానకమున పుడకవలెన్
తానుభయుల మధ్యనుంట తగదంచును తో
డ్తో నాత్రేయుడు తొలగెను
ఆనవ దంపతులకిచ్చి యచ్చపుస్వేచ్ఛన్. 114

కం. అవ్విధ మాతం డరిగిన
యవ్వల నవ్వధువు వరుడు నారామమునన్
కవ్వింపుల నవ్వింపుల
గువ్వలవలె ప్రేమగూడి క్రుమ్మరిరి కడున్. 115

సీ. బొండుమల్లెలనీడ కొండొకసేపు వి
హారమ్ము గావించి హాయిగొనుచు,
పచ్చికబయళుల మచ్చికమీఱగ
శయనించి కడుగడు సంతసిలుచు,
పువ్వులపొద దూరి పూసెజ్జపై నిష్ట
కార్యకలాపాల కడలు కొనుచు,
కేళకూళి నొకింత క్రీడించి తత్తీర
మున విశ్రమించి సమ్మదముపడుచు-
సేదతీఱి యొక్క చెట్టునీడన గూరు
చున్న దంపతులను చూచికొనుచు
వచ్చె మిత్రవసువు వడిగ నచ్చోటికి
బావ కెఱుక పఱుప వార్తనొకటి. 116

కం. జీమూతవాహనుం డపు
డామిత్రావసుని కుశలమారసి పిదపన్
తామలయవతి దెస తిరిగి
"నే ముచ్చటలాడివత్తు నీవేగు" మనన్. 117

సీ. వల్లెయంచు మలయవతి యంతిపురిజేర
బోవ-మిత్రవసువు బావతోడ
వచియించెనిటు "మీకు పగతుడైన మతంగ
హతకు డకట! పొంచి యదనుగాంచి
దండయాత్ర యొనర్చి తమరి రాజ్యంబెల్ల
నాచికొనియె గాన నాజిలోన
వాని మదమడంచి బంధించి తెచ్చెద
నన్నుబంపు"డనుచు విన్నవింప

దూరభారమ్ము మది తేఱిపాఱజూచి
తా నహింసాప్రవృత్తి నౌదల ధరించి
ప్రజల మేలును పగతుని బాగుగోరి
పలికె మిత్రావసున కిట్లు భావుకుండు. 118

కం. "అతడేలిన నేనేలిన
హితమే కద ! జనులకు నొనరింపగవలయున్,
క్షితిపతిగా తద్ధితమును
మతంగుడే ప్రజకొసంగ మరినేనేలా ? 119

తే.గీ. ప్రజల బాగోగు లరయని ప్రభునికన్న
ప్రజల మేలెంచి పాలించు ప్రభువెమిన్న
అట్టి పరిపాలనము మతంగాఖ్యు వలన
ప్రజకు లభియింప నింకేమి వలయు మనకు ? 120

కం. అపకారికి సైతమ్మును
ఉపకారమొనర్చుమంచు సూక్తి వెలుంగన్
నృపుడగు మతంగు నింతయు
కృపగనక వధింపబూన నింగితమగునే ? 121

తే.గీ. పరుల కుపకార మొనరించు భావమూని
ప్రాణమైనను త్యజియింపబూను నేను
ఒరుల ప్రాణాలు దీయంగ నోపుదెట్లు ?
వారి బాధింప నామది కోరునెట్లు ? 122

తే.గీ. ప్రజల భద్రత, మన్నిని బాగుగోరి
రక్ష్యరక్షక సంబంధ లక్ష్యమెంచి
ఆ మతంగుని సఖునిగా ప్రేమజూచి
విడిచి పుచ్చుడి ! అదె పదివేలు నాకు." 123

కం. నావుడు మిత్రావసువున్
బావకు ప్రత్యుత్తరమ్ము వలుకక తత్స
ద్భావమున కలరి, చనియెను
భావుకు దోడ్కొనుచు రాజ భవనంబునకున్. 124

తే.గీ. అంత పగలెల్ల కష్టించి యలసిపోవు
సర్వజీవాళి కిడెడు విశ్రాంతినాగ
వెల్గులను తగ్గి చీకటుల్ పేరుకొనగ
భాస్కరుం డస్తమించెను పశ్చిమాద్రి. 125

కం. శ్రీపైడి చెలువ చెలువుడు
రేపాకపు రమ్ము నేలు నృహరిప్రభువున్
కాపాడుగాక ! దాపై
ప్రాపై యెపు డంతమాంబ ప్రథమతనూజున్. 126

# జీమూతవాహనుడు

## (ఉత్తరార్ధము)

శ్రీకుంటాన్వయ మౌళిన్
పాకారి శ్రీవిలాసి భాస్కరరెడ్డిన్
వీకన్ జూడగదే ! రే
పాకన్ నరసింహమూర్తి ! పాపనివర్తీ !! 1

ఆ.వె. అవధరింపుమయ్య ! యాపైన జీమూత
వాహనుండు తనదు దేహయష్టి
ఫణుల గాచుకొఱకు పక్షీంద్రునకు భోజ
నముగ నొసగినట్టి విమల చరిత. 2

కం. కొండొక దినమున మిత్రవ
సుండును ఖేచరవిభుండు సోత్కంఠన్ కన్
పండువౌనర్చెడు గంధపు
కొండకు వాహ్యాళికేగి క్రుమ్మరువారై. 3

ఆ.వె. అట సముద్రతీరమందు హాయిగ తిర్గ
నెంచి యొక్కప్రక్క గాంచె బావ
తెల్లనయిన మొయిళులెల్ల కప్పంబడి
గుట్టలట్టులున్న గుంపునొకటి. 4

కం. "ఇవి మలయక్ష్మాభృత్సా
నువులేయగు, నైన నిట్లనూన ధళధళ
ద్ధవళిమ యెక్కడి"దని మల
యవతీప్రియు డక్కజముగ నక్కజపడగన్. 5

ఆ.వె. బావమరది మిత్రవసు వద్ది గమనించి
పలికె బావకిట్లు "బావగారు !
మలయశైల సానువులు కావుకావయ్య !
కనువినికిఖుల యెముకల గములివి." 6

కం. ఆ మాటలకున్ బావుకు
డామిత్రావసున కిట్టులనియెన్ గలకన్
"పాముల కిచ్చో నిట్టుల
సామూహిక మరణమేల సంప్రాప్తించెన్ ?" 7

ఆ.వె. అనుడు మిత్రవసువు వినిచె– "సామూహిక
మృతిని ఫణులు పొందలే" దటంచు
పాపజాతిపాలబడిన దుర్మరణమ్ము
గూర్చి చెప్పె పూసగ్రుచ్చినట్లు. 8

సీ. "తరతరమ్ములనుండి గరుడకులమునకు
నురగజాతికి వైర ముండు కతన
ఇరుగెలంకుల వైరమింకించి పొందిక
గూర్చెడువారు లేకుండు కతన
గరుటాలమంతుని కడగి మార్కొను శక్తి
యురగు లెవ్వరికి లేకుండు కతన
సతతమ్ము గరుడు డిచ్చావృత్తి ఫణుల భ
క్షింప తజ్జాతి క్షయించు కతన
పన్నగేశుండు వాసుకి ఖిన్నుడగుచు
పక్కిరాయని దరిజేరి మ్రొక్కులిడుచు
సర్ప మారణహోమ మ్మొనర్పకుండ
నియమమొండు నాతని కిట్లు నిర్ణయించె. 9

కం. 'దినమొక్క పాముగా భో
జనమును పుత్తెంతు నీకు సమయమున కకా
రణముగ నగు మా కులమా
రణ హోమము నాపి కరుణ రక్షింపగదే!' 10

కం. అనాగేశుం డిట్టుల
ఆనాగాశనుని వేడ నలరి యతండున్
నానాడు దినిన లేలి
హానాస్థులె మనముచూచు నచలము"లన్నన్. 11

కం. ఇన్నాళ్లిటు పెనుకాలం
బన్నాగులకున్ ఘటించు నన్యాయమునన్
ఖిన్నుండై ఖేచరపతి
కన్నీరై కరగె నెడద కలతపడంగన్. 12

తే.గీ. "ఆశ్రితులఁబ్రోచు భారమ్ము నవలఁద్రోచి
తన్ను తాగాచుకొనుటకు పన్నగపతి
ఉరగముల బలివెట్టుటల్ తరచిచూడ
కంచెయే చేనుమేసిన కరణియయ్యె. 13

తే.గీ. నేన యైనచో మొదట నా ప్రాణములను
బలియొసంగిన మీదటే ప్రజలవిడుతు
తన్నుతాగాక తనవారి మున్నగనుట
ప్రథమ కర్తవ్యమదిగాదె ? ప్రభునకెందు. 14

కం. శాత్రవుని జేకుమడవక
భ్రాత్రాదుల విహగవిభుని వాతవయిచుటన్
ఆ త్రాచుల మన్నిడు చ
రిత్ర విహీనుండునయ్యె జేడులలోనన్. 15

కం. కాయక జనులను, వెఱచిప
రాయికి లోబడిన 'దుర్బలస్యబలంరా
జా' యను న్యాయమ్మది య
న్యాయమ్మయిపోదె ? భూమినాథుని యెడలన్." 16

## ద్విపద

అనుచు జీమూతవాహనుడు ఘనమ్ము
ఫణుల దుస్థితినెంచి పరితాపపడుచు
ఫణినాథు సంధికి పరికోపపడుచు
"ఫణిభుక్కు కార్యమ్ము పరిహార్య" మనుచు
తనబావమరిదితో తద్దయుం బలుక
పనివాడు వేవచ్చి ప్రణతి గావించి
అమ్మిత్రవసువుతో "ఆర్య ! మీనాన్న
మిమ్ము రమ్మంచు పంపించిరి నన్ను"
అని విన్నవింపగా ఆ మిత్రవసువు
తనబావతో "పోవుదము ర"మ్మటన్న
"నీవేగుమా ! ముందు నేనాగి కొంత
భావశాంతినిబొంది వచ్చెద" ననిన
భటునితో నామిత్రవసు వేగినంత
పటుమతిన్ జీమూతవాహనుం డంత. 17

తే. గీ. చందనాద్రిని డిగ్గి విశ్రాంతి గొనుచు
శరధి తీరాన నటునిటు తిరుగుచుండి
యురగకులమును రక్షించు తెరువుగూర్చి
తా తదేకాత్ముడై యున్న తరుణమందు 18

కం. దవ్వుల నెవ్వారొ ఒక ముస
లవ్వ తన కుమారునెంచి 'హాహా!' యనుచున్
నెవ్వగ నొందుట విని తా
నవ్వయిపున కాతురమున నరుగుటయు నటన్. 19

సీ. "నాజీవరత్నమా! నా ప్రాణమిత్రమా!
నా ప్రేమపాత్రమా! నా కుమార!
నా కంటి దీపమా! నా యింటి దైవమా!
నా వంశవర్ధనా! నా తనూజ!
నా పెన్నిధానమా! నా సన్నిధానమా!
నా పంచప్రాణమా! నా సుపుత్ర!
నా పాలి భాగ్యమా! నా నోముల ఫలమ్మ!
నా వరమ్ముల పంట! నాదుకూన!
రార! యనుపమ గుణధుర్య! రారతనయ!
చెంపగిల్లిన పాల్గారు చిన్నికుఱ్ఱ
బొల్లిగ్రద్దకు బువ్వగా బుచ్చినిన్ను
చనక నాకెట్లు మనసొప్పు శంఖచూడ! 20

తే.గీ. చిన్నతనమందె నీతండ్రి చెల్లిపోవ
ఎండ కన్నెర్గనీక నిన్నెల్లవేళ
కంటవత్తిడుకొని పెంచుకొంటిగాని
కడకు నిటులౌట కలనైన గాననైతి. 21

తే.గీ. పదినెలల్ మోసి నినుబెంచి తుదకునేనె
చేనుగాచి నక్కలపాలు చేసినట్లు
చిలువమేతరి కిడుచుంటి చేతులార
నా పురాకృత కర్మంబు నన్ను రేచ. 22

కం. నచ్చిన పిల్లను చేకొని
పచ్చని సంసారమెదిగి పాల్వొంగంగన్
పచ్చగ పదికాలమ్ములు
పుచ్చెదు నా తండ్రి! నీకు పుచ్చెనె బ్రదుకున్? 23

ష.గీ. ఫలము దొరగియు కాండమ్మె కలిగియుండి
నెగడు నీవారమట్టుల నిగనిగంపు
యౌవనశ్రీ దొరగి- పూనిస్థావిరమ్మ
రాలుటకు సిద్ధమైన కారాకువంటి
పండు ముదుకను నీవుబో నుండినేను
బ్రతికి ఫలమేమి? నామన్కి పాడుగాను. 24

కం. పున్నామనరకమునకున్
నన్నున్ దప్పించిపోచు నాచిన్నిసుతా!
నిన్నా గరుడికి నేనే
యన్నంబుగ నెట్టులిడుదునయ్యా? యయ్యో! 25

ఆ.వె. తల్లిచావ, కొడుకు తల్లికి 'తలగోరు
పట్టి' శ్రాద్ధములను బెట్టునాడె
సుగతి యబ్బునంచు సుమతు లన్మాట నా
యందు వ్యత్యయంబునయ్యె కొడుక!" 26

ష.గీ. అంచు నానావిధమ్ముల నెంచియెంచి
గోలుగోలుననేడ్చి గగ్గోలుపడెడి
తల్లి శోకమ్మ మాన్పగా ధైర్యమూని
శంఖచూడుండు తన మనస్సాగరమున
పొంగు దుఃఖంపుటుప్పెనన్ గ్రుంగనొత్తి
పలికె తనతల్లి కిటు సమాశ్వాసముగను. 27

కం. "అమ్మా! చావుంబుట్టువు
లిమ్మహి సృష్టిస్థితిలయ హేతువులనుచున్
నెమ్మది నెఱింగియు కడుపు
చుమ్మలు చుట్టంగనేల? శోకించెదవే? 28

కం. సూనునిపై వత్సలతన్
సూనృతమును మఱచి యిట్లు స్రుక్కెదుగానీ
జ్ఞానాత్మలు తొల్లి 'యని
త్యాని శరీరాణి' యనగ నాలింపవటే? 29

ష. గీ. పుట్టువుందొట్టి నను తలపుండ్లు గడిగి
పెంచి పెద్దజేసితివమ్మ! ప్రేముడించి
పెద్దతనమున నిన్ను సేవించుకొనెడు
భాగ్యమును నోచనైతి దౌర్భాగ్యమేమొ!
మాతృసేవకు దూరమై మడియుమనుచు
వ్రాసె గాబోలు! నుదుటిపై బ్రహ్మ అకట!" 30

కం. అని యిట్టుల కుందెడు వా
రినిగని ఖేచరవిభుండు హృదయ సరసిలో
ననుకంపన పంకేజము
ననలెత్తగ పలికె వృద్ధనాగిని కిటులన్. 31

కం. "తల్లీ! నీవిట్టుల చుర
పిల్లగ పనిలేదు లేదు వేళమ్ముగనీ
పిల్లనికి మారుగా నే
వెళ్లెదు నోగిరముగాగ వినతేయునకున్. 32

తే. గీ. ఎవడు వీడంచు నీమది నెంచకమ్మ!
అనఘు జీమూతకేతుని యాత్మజుడను

అవని జీమూతవాహను డనెడువాడ
తావకీన సుతున్ బ్రోవదలచినాడ. 33

కం. ఏకైక సుతుని పోనిడి
యేకాకిగ మనుదులెట్టు లీలోకములో
నీ కొమరుని బ్రదికింపగ
నాకీ యవకాశమిచ్చి నడుపుము తల్లీ! 34

తే.గీ. వధ్య చిహ్నమ్ము నాకిచ్చి వైశమీవు
వరకుమారుతో గృహమున కరుగుమమ్మ!
గరుడు డేతెంచు సమయమ్ము గదిసెగాన
వధ్యశిల జేరబోయెద వాని దాల్చి." 35

ఆ.వె. అనిన- శంఖచూడ జనయిత్రి ఖేచర
పతి పరోపకారకృతికి మెచ్చి
చిలువ తిండినోట జీమూతవాహను
వైవ నిష్టపడక పలికెనిట్లు. 36

తే. గీ. "ప్రాయమున నున్నవాడవు, పడుచుభార్య
గూడి సంసారసుఖమందువాడ వీవు
పులుగుతేనికి బోనమై పోదువేల ?
నా కుమారుకు మారుగా రాకుమార! 37

తే. గీ. మా ఫణీంద్రుడు వాసుకి మా ఫణులనె
గరుడి కాహార మొసగంగ కట్టడినిడ
పరులు పక్షి కోరెమగుట జరుగునెట్లు ?
భుజగభోజను డితరుల ముట్టునెట్లు ? 38

తే. గీ. వృద్ధనాగినితో గూడ బిడ్డడయిన
శంఖచూడుండు గదిసి నిశ్శంకతోడ

వక్కాణించెను జీమూతవాహనునకు
సార్థకంబొప్పనిట్లు నిస్స్వార్థబుద్ధి. 39

తే.గీ. "ఓ మహాభాగ! నీవిట్లు మామకీన
మృతికి బదులుగా మరణింప మేలటయ్య?
'తన్నుమాలిన ధర్మంబు' దలపకీవు
అపమృతిని కోరుకొనుటేమి న్యాయమయ్య? 40

ష.గీ. క్రొత్తదాంపత్యమీగి, చేకొన్నదాని
కా నవోఢకు వైధవ్య మంటగట్టి
ఉత్తపుణ్యాని కిట్టుల నుత్తరింప
బడగనెంచెడు నినువంటి వెడగునెందు
గానను, కడుపులోచల్ల కదలకుండ
బ్రతుకు పోపొమ్మ నీ మాత్రపితలగొల్చి. 41

కం. నాతల్లి కడుపుకోతను
నీతల్లికి నంటగట్టి నింద్యుడనగుచున్
భూతలమున నెటు మనుదును
నా తలవ్రాతన్ భరించి నలియక నేనున్. 42

కం. నాచావు నేను చచ్చెద
ఈ చాయన్నిలువకుండ నెచ్చటికైనన్
వే చను చనుమా!" యనుచున్
ఆ చిలువకొమారు డిట్టులనియె జననితో. 43

కం. "శ్రీకైవల్యప్రదుడగు
గోకర్ణేశ్వర సుపర్వు గుడిగోపురమున్
ఈక్రేవన్ గలదు, నమో
వాకములిడివత్తమమ్మ! పదుమా!" యనుచున్ 44

తే. గీ. శంఖచూడుండు తల్లితో చనిన వెనుక
పట్టువదలక జీమూతవాహనుండు
వాని నెటులైన రక్షింపబూని యపుడు
స్వాంతమందు యోచించుచున్నంతలోన. 45

కం. సేవకవృద్ధుం డొక్కఁడు
కావుల యుగళంబు వెంటగైకొని యటకున్
వేవచ్చి సవినయంబుగ
ఆ విద్యాధర కుమారు కనె నివ్విధమున్. 46

## గీతమాలిక

"సంప్రదాయానుసారంబు సత్కరింప
మలయవతిమాత క్రొత్త జామాతవైన
తమకు కానుకగా కావివస్త్రద్వయంబు
నిచ్చిరమ్మంచు నాతోడ పుచ్చినారు
వీనిగొని ధరింపు"డనుచు వినిచి నిలువ
వాని గనుగొని జీమూతవాహనుండు
భాస్కరుని గాంచి వికసించు పద్మమట్లు
వాడి వత్తలైన మనంబు ప్రస్ఫుటింప. 47

కం. పేదకు పెన్నిధి దొరికిన
మాదిరి మిక్కుటము హర్షమాణుండగుచున్
ఆ దుస్తులుగొని వైళమ
తాదాలిచి భటునిబంపి తదనంతరమున్. 48

తే.గీ. "ధన్యుడనుగానె ? నేను- యథార్థమహిని
బ్రోచుటంజేసి నే"దంచు మురిసిపడుచు
పక్షి కాహారముగనేగి పాములెల్ల
నిల్చు నేచోట నాచోట నిల్చినంత. 49

కం. వాతోద్ధూతంబయి జీ
మూతంబులు చెదర, కలగ భూ దివులు, మహా
వాతూలము మునురా తరు
వాతన్ గరుడుండువచ్చె పక్షజవమునన్. 50

తే.గీ. వచ్చిరాగనె మునుమున్నె వచ్చియున్న
వస్త్రప్రచ్ఛన్ను జీమూతవాహు గరుడి
సర్ప మంచెంచి వజ్రంపు చంచుపుటిని
కఱచిపట్టి యాపైన నాకసము కెగసి. 51

కం. గిరిసారము శిఖరము పై
కరిగి యథావిధిగ నతని నాహారింపన్
దొరకొని కండలు చీల్చుచు
కరకరమని నమలుచుండ ఖచరేంద్రుండున్. 52

కం. "ఈనా డీతని కిట్టుల
నేనోగిర మగుటచేత నిజమీభూమిన్
ఈ నాజన్మ తరించెను
ఆ నాగుని బ్రోచుకతన"యని ముదమందున్. 53

తే.గీ. కండకండలన్ వజ్రతుండుండు చెండు
చుండ నాఖండల నిభుం డఖండముగను
సంతసిలు పోటుపోటున సమధికముగ-
త్యాగధనులు తనుగ్లాని దలతురెట్లు ? 54

కం. ద్యోచరుని త్యాగమునకున్
ద్యోచరులు లతాంతవృష్టి తుష్టిన్ గురియన్
ద్యోచరముగాంచి తలది
మ్మై చెడి దోదూయమాన మానసమగుచున్. 55

ఆ.వె. "నాగులందు పెద్దనాగు వీతండు కా
బోలు ! కాకయున్న పూలవాన
గురియుచుందురేల ? సురలిట్టు లితనిపై"
నంచు నతని త్యాగమెంచె గరుడి 56

కం. జీమూతవాహనుం గొని
వ్యోమంబున గరుడు డేగుచున్నప్పుడు చూ
డామణి యూడిపడెను త
ద్ధామ ప్రాంగణమునందు- దానిని గొనుచున్. 57

తే.గీ. మలయవతి తనపతి శిరోమణి యటంచు
తెలిసి దురపిల్లె, నత్తమామలును గూడ
బోరుబోరున నేడ్చిరి పుత్రునెంచి
నిర్భరాత్మ కన్నీరు మున్నీరుగాగ. 58

తే.గీ. చెల్లచెదరుగ నటనట చిల్లిపడిన
రక్తపుంబొట్లతోడి మార్గమున నేగి
వాని జాడల నరయుచు వారుముగురు
సత్వరము చేరుకొనిరి యాషాఢమునకు. 59

తే.గీ. అచట శంఖచూడుండు దేవాలయమున
కరిగి శివుగొల్చి తల్లితో తిరిగివచ్చు
సరికి మలయాద్రి శిఖరాన గరుడు డతని
భక్షణము చేయుటను చూచి ఖావురుమని. 60

కం. "ఉరగేశుడు వాసుకి న
న్నురగుని బుత్తెంచె తమకు నోరెముగాగన్
ఉరగుని విడి పరుని దినుట
హరివాహన! తగునె మీకు? నవినీతిగదే! 61

తే. గీ. అతడు విద్యాధరకు లాన్వయాబ్ధిచంద్రు
డైన జీమూతవాహ నాహ్వయ ఘనుండు
నాకు మారుగ నరుదెంచి నీకు వీక
దేహయాత్ర యగుచు కోరె దేహయాత్ర. 62

తే. గీ. ఫణుల మాంసశోణిత మానువాడ వీవు
పర వపుర్మాంస రుచిభేద మరయలేవా?
క్షితి 'క్షుధాతురాణాం నరుచిర్నకాల'
యనెడు నట్టు లాకట నిట్టులైతివేమొ!" 63

తే. గీ. అనుడు జీమూతవాహనుం డందుకొనుచు
ఖగపతికి బల్కె నపు డవకాశమిడక
పన్నగము మాటలను నమ్మి పన్నగారి
తన్ను విడచునేమో యన్న తత్తరమున. 64

తే. గీ. "తల్లివేసటబాపిన దంటవీవు
తోడి మిత్రుని వెతబాపువాడ నేను
ఉభయు లనుసరించిన మార్గమొకటిగాన
సాయపడి నన్ను కృతకృత్యు జేయుమయ్య! 65

కం. ఆకొన్నవాడ వీవు, వి
వేకము గోల్పోవక యవివేకి యురగుడున్
వాకొను వాకుల నూకొని
యీకొని యీకొనగబోలునే? సాపడుటన్. 66

కం. కావలసినంత మాంసము
నా వపువున నింకగలదు నాగాంతక! నీ
భావములో శంకించక
కావింపుము భోజనంబు కడుపారంగన్. 67

కం. చెవి సొంటికొమ్ము నూదుచు
చెవింగఱచు పన్నగు పెడచెవిబెట్టదగున్
చెవినిల్లు గట్టుకొని నీ
చెవివేసెడు నా వచస్సు చెవిబెట్టదగున్." 68

కం. అని భాషించెడు ఖచరేం
ద్రుని కంఠస్వర మెఱిగి యెదో పొరపాటున్
తనయందు జరిగెనంచును
వినయంబున పల్కెనిట్లు వినతేయుండున్. 69

తే.గీ. "ఆర్య! భవదీయ రుధిరంబు నానవేను
నాదు హృదయంబె హరియించినావు నీవు
పాతకమునకు బూనినవాడ నేను
ప్రాణరక్షకు బూనినవాడ వీవు. 70

కం. నీకును నాకును గుణమున
నాకాశము భూమికున్న యంతరమెన్నన్
లోకోన్నత మృదుతరుడీ
వే! కఠినుడనేనె యెఱుగనే? మహనీయా! 71

ఆ.వె. ఎఱుగకేను నిన్ను ఎరగా గ్రహించితి
ఎఱిగి నీవునాకు ఎరయయితివి;
ఇందుదోష మెవరియందో! నేనెఱుగ, నా
యందు గలిగెనేని యాదరింపు" 72

కం. అని వైనతేయుడు క్షమా
పణగోరెడు నంత నటకు పరుగు పరుగునన్
కనకవతియు మలయవతియు
అనఘుడు జీమూతకేతు డరుదెంచుటయున్. 73

తే.గీ. కాంచి, జీమూతవాహుండు క్షతతనుడగు
తనను తనవారు గనకుండ తత్క్షణంబ
కావివస్త్రంబు తనపైన గప్పుమనుచు
పలుక—శంఖచూడుం డట్లు వలువగప్పె. 74

తే.గీ. వలువ గప్పిన మాత్రాన వపువు గంట్లు
దాగునే? బయల్పడ రక్తధార లురలి;
కడగి చిఱుబట్ట నటునిటు మడచి ముడిచి
సూది ముల్లెగట్టిన పౌడసూపకున్నె? 75

కం. సూనునికి సంభవించిన
దీనావస్థను గని పితృదేవుడు ప్రసువున్
ఆ నవ్యస్త్రీ గూడ న
హీనపు కంఠస్వరాన నేడ్చిరి కడిదిన్. 76

కం. జననీజనకులు మూర్ఛన్
గొని వారాపైన తేరుకొని, కనకవతీ
వనితామణి దూషించెను
ఘనశోకం బాపలేక గరుడిన్ కడిదిన్. 77

కం. "తోబుట్టువు లెవ్వరు నీ
తో బుట్టరె? చాలులేదె? తొందరపడియ
య్యో! బాగోగు లెఱుంగక
నా బుడుతని గుడువ నీ ఘనం బెట్లొప్పెన్. 78

ఆ.వె. కొడుకుజంపి కడుపుకోత గూరిచి ముల్లె
గట్టు కొందువేమి ? ఖగపతి ! క్షితి
ఈవు నీదుతల్లికెట్టులో యట్టుల
నాకు ముద్దుగాదె ? నా సుతుండు. 79

కం. మా కొడుకు జంపి యూరక
నే కాకులుగా నొనర్చి వృద్ధుల మమ్మున్,
మా కోడలి సౌభాగ్యము
పోకార్ప దలంచితౌర ! పోకిరి గరుడీ !" 80

తే.గీ. అనుడు జీమూతవాహనుం డడ్డుపడుచు
పలికె తల్లితో నిట్టుల "పక్షివిభుని
తప్పులేదమ్మ ! యిందులో- తగి యిదంత
నేన చేసితి నతని నిందించనేల ? 81

కం. ఆర్త త్రాణ పరాయణ
మూర్తులు దీనులను మున్ను బ్రోవరె ? కరుణన్
ఆర్తుని నాగుని బ్రోవగ
వర్తించితి తత్ప్రథాను వర్తన మతినై. 82

కం. నా పూర్వ పుణ్య ఫలమున
మీ పుత్రుడనై జనించి మీకున్నాకున్
ఏపారు యశస్సుగ నే
నీపని కొడబడితినమ్మ ! యిది తప్పిదమే ?" 83

కం. నావుడు గరుటామంతుడు
"నా వలనన యింతమంది నలగిరి యిటులన్
మూవుర ? యేవుర ? అకటా !
వేవేవురు నాగు"లని వివేచనపరుడై. 84

కం. పాయక పశ్చాత్తాపము
చేయుచు "నేనింక బ్రతుకజెల్లునె ? పాపిన్
ప్రాయశ్చిత్తముగా ఈ
తోయధి బడబానలాన దూకి మడిసెదన్." 85

తే. గీ. అంచు నెగయ నుంకించిన యతనిగాంచి
యనియె జీమూతవాహనుం డాదరమున
"పాప పరిహారమున కబ్ధి బడగనేల ?
కలదు మార్గాంతరము తెల్పగలను నేను. 86

తే. గీ. 'ఆత్మవత్సర్వ భూతాని' యని తలంచి
'ఆత్మవన్మన్యతే జగ'త్తనుట నెంచి
అఖిల భూతమ్ములందున నక్కటికము
గలిగి చరియింపు మంతియ గాక వినుము. 87

కం. పక్షీంద్ర ! నీవ యిట్టుల
కుక్షింభరి వగుచు రక్షకున్నెడమగుచున్
చక్షుశ్శ్రవముల దినుటను
దక్షత యనిపించుకొనునె ? ధర్మంబగునే ? 88

కం. సాధుమతి ! 'అహింసాపర
మోధర్మ' యటన్న న్యాయమున కలవడుచున్
శ్రీధరముల జంపకునికి
నీ ధర్మముగా దలంచి నెగడు మికపయిన్." 89

ఆ.వె. అనెడు తత్త్వబోధ మాలించి పాలించి
"జీవహింస నింక చేయ"ననుచు
ప్రతిన బూనె స్వర్ణపక్షుండు దక్షుండు
భూతదయ వహించి ముందు ముందు. 90

ఆ.వె. అట్లు బోధచేసి యాపై తనుగ్లాని
సైపలేక చివరిసారి పితల
పాదపద్మములకు ప్రణమిల్లి జీమూత
వాహనుండు పాసె ప్రాణములను. 91

ఆ.వె. పదములందువ్రాలి పంచత్వ మొందిన
కన్నకొడుకు గాంచి కన్నవారు
తల్లడిల్లిరెంతొ తన్మ నఃక్షేత్రాలు
బీడువార మేను బ్రోడువార. 92

తే.గీ. కనకవతి యెలుగెత్తి స్వర్గమున కొత్తి
పలికె "నోయి దేవేంద్ర! నా పలుకు లరసి
మృతుడయిన నాకుమారు నమృతమువోసి
యైన బ్రతికింపవే!" యంచు నార్తితోడ. 93

కం. అమృతమ్మను మాట చెవుల
కమృతమ్మయి తోప, ఖేచరాధిపతనయున్
అమృతునిగజేయ దొరకొని
అమృతార్జన బుద్ధిబూని యాగరుడుండున్. 94

ద్విపద. "తెలుగంటిజేని ప్రార్థించియో కాక
తెలుకువన్ బోరాడి తిరివెట్టి యైన
తెలుగంటిబోనమ్ము దెచ్చెద'' ననుచు
తెలుగంటి త్రోవను తెగిసాగిపోయె. 95

కం. "తలకొఱవిపెట్టు సుతునకె
తలకొఱవిన్ బెట్టనయ్యె తండ్రిని నేనే;
తలక్రిందయ్యెను సంస్క్రియ
తలవ్రాత నతిక్రమింపధరమె? యెవరికిన్." 96

తే.గీ. అనుచు జీమూతకేతుండు ఫణికుమారు
"చితిని జేర్పించు త్వరగ నా సుతున"కనిన
శంఖచూడు డావిధముగ సలిపినంత
మలయవతి దుఃఖితాత్మయై పలికె గౌరి. 97

కం. "ఓ పరమేశ్వరు రాణీ!
నాపతి విద్యాధరాధినాథుం డనుచున్
జేపెట్టితివి గదమ్మా!
నాపాల ననత్యమయ్యెనా? నీ పలుకుల్. 98

ఆ.వె. క్షితిని 'భూషణంచపతి'నా ప్రసిద్ధమౌ
బుధ సుభాషితంబు పొల్లువోవ
పతివిహీనయైన సతి యప్రకాశాత్మ
గాదె! యంతకన్న గర్హ్యమేది? 99

కం. పతి నెడబాసి క్షణంబును
పతిదేవత లుండగలరె? పతిదేవుండున్
గతపడగా నెటు బ్రతుకుదు
సతినై గైకొందునింక సహగమనంబున్." 100

తే.గీ. అనుచు నాయత్తపడుచుండ నానవోఢ
కామృడాని ప్రత్యక్షమై యనియెనిట్లు
"మలయవతి! సాహసమ్మోన వలదు వలదు
నీదు పతిదేవు బ్రతికింతు నే"నటంచు. 101

ఆ.వె. "లెమ్ము లెమ్ము వత్స! లెమ్మోయి! యని గౌరి
అమృత హస్తమెత్తి యతని దాక
నిదురగొన్నవాఁడు నిర్నిద్రుడై లేచు
నటు సజీవుడగుచు నపుడులేచి. 102

5)

శా. "ప్రాలేయాచల కన్యకా! సుచరితా! బాలేందు మౌళిప్రియా!
శైలేయీ! వరదాయినీ! హితమతీ! సర్వార్థ సంసాధినీ!
కాళీ! మంగళదాయినీ! గుణధునీ! కైవల్య సంధాయినీ!
కైలాసాచల వాసినీ! భగవతీ! కైమోడ్పు గైకోగదే!! 103

కం. ననుగావగ వచ్చితొ? మ
జ్జననీ జనకులను బ్రోవ జనుదెంచితొ? యీ
ఫణులను మనుపగ వచ్చితొ?
జననీ! త్వద్దర్శనమున జన్మ తరించెన్." 104

ష.గీ. అనుచు జీమూతవాహుండు హైమవతిని
ప్రార్థనము చేయుచుండ నభంబునుండి
మరణమొందిన ఫణులపై మబ్బులేని
వాన యట్టుల నమృతంపువాన గురియ
ఖచరు డారసి కరము నక్కజము నొందు
టరసి మురిసి యాతని కిట్టులనియె గౌరి. 105

కం. "నీకు విధేయుం డగుచున్
ఆ కశ్యపనందనుడు మృతాహుల మనుపన్
నాకము నందుండి సుధన్
నీకై కురియించె నిట్లు నీ వెఱుగవటే? 106

తే.గీ. అట్టి యమృతమాస్వాదించి గిట్టినట్టి
పాపగములెల్ల నదె సజీవమ్ములయ్యె
నీ పరోపకారముచేత నిక్కువముగ
పన్నగానందమయ్యె నిన్నెన్నతరమె? 107

సీ. జనకుల సేవించి సాటిలేని పితృ సే
వా పరాయణుడంచు వరలినావు

అహితుడైన మతంగ హతకు నైరించి య
జాత శత్రువనంగ జాలినావు
అపమృత్యువును బొందు అహికులంబునుగాచి
ప్రాణదాత యనంగ బరగినావు
పరుని కొఱకు కళేబరమునే యర్పించి
త్యాగశీలురమించి తనరినావు
'త్యాగ ఏకోగుణః శ్లాఘ్య' యనెడు మాట
సత్యమయ్యెను నీపాల నిత్యమగుచు
ధర 'పరోపకారార్థమిదం శరీర'
మనెడు నార్యోక్తి నీయందె సార్థకంబు. 108

ష.గీ. ప్రాణదానార్హుడవెకాదు, ప్రజలనేలు
దక్షుడవు, సర్వసామ్రాజ్య రక్షకునిగ
జేయుచున్నాను, రాజ్యమ్ము చేకొనుమిక
అదె మతంగహతకుడు లోనగుచునీకు
ప్రణతు లిడుచుండె; నింకేమి వలయు వత్స!"
యనిన జీమూతవాహనుం డనియె నిట్లు 109

సీ. "చావువాతనుబడు శంఖచూడుం డను
కంపతో నింక రక్షింపబడియె
అపమృత్యువును గొన్న యాశీవిషము లెల్ల
నిమ్ములగన సజీవమ్ములయ్యె
తెఱగంటిబోనము దెచ్చిన లావరి
పాయక మాకు విధేయు డయ్యె
గతపడి బ్రతుక మత్పితరులు పోయెడు
ప్రాణముల్ వచ్చిన వారలైరి

అమ్మ ! భవదీయ కృపను విద్యాధరాధి
రాజపదవి లభించె విరాజితముగ
మాకు నింకేమి వలయు నీ స్మరణదప్ప
నైన నిట్లగుగాక ! యీ యవని యందు. 110

సీ. నెలమూడు వానలు తొలికి 'రైతాంగము'
పాడిపంటలతోడ ప్రబలుగాక !
కవికోకిలమ్ములు కవితా సదస్సుల
గానాను రక్తితో క్రాలుగాక !
కులమత భేదమ్ము తొలగి ప్రజానీక
మన్యోన్య మైత్రితో నలరుగాక !
బడుగు వర్గాలను పైకితెచ్చి ప్రభుత
ప్రగతి మార్గమ్మున బరగుగాక !
కలుగుగాక ! 'నిత్యకల్యాణమును పచ్చ
తోరణము'ను నేటి దొరతనమున
అటులె 'మూడుపూవు లాఱుకాయల'వోలె
వరలుచుంద్రుగాక ! ప్రజలు సతము." 111

కం. జీమూతవాహు చరితము
నే మనుజుడు వ్రాయునో పఠించునొ వినునో
ఆ మనుజు డంది సుఖముల
తా మరణాంతమున శివపదంబును బొందున్. 112

కం. శ్రీరేపాక పురీశు డు
దారుడు నరసింహమూర్తి దైవోత్తముడున్
వీరారెడ్డి తనయు నే
పార గటాక్షించుగాక ! యనవరతంబున్. 113

***

# ఇందలి పలుకుబడులు

## లోకోక్తులు

## సామెతలు



## జాతీయములు

| | |
|---|---|
| వాడి వత్తలగుట | 2-47 |
| కన్నీరు మున్నీరు | 2-58 |
| చెవిలో సొంటికొమ్ముూదుట | 2-68 |
| చెవి గఱచుట | ,, |
| చెవినిల్లు గట్టుకొనుట | ,, |
| చెవివేయుట (చెవివేసెడు) | ,, |
| ఎలుగెత్తుట | 2-93 |
| నిత్యకల్యాణము పచ్చతోరణము | 2-111 |
| మూడు పూవు లాఱుకాయలు | ,, |